

ఏ క్షణాన ఆ లోహపువృక్షం
మా పెరటిచెట్టును మించి ఎదిగి,
భుజాలు ఎగరేస్తూ
సిల్వర్ నవ్వులు విసిరిందో-
ఏ ముహూర్తాన మా వూరి డాబాలపై
సాలెగూడు వంటి చెత్తిరి వలలు మొలుచుకొచ్చాయో
అప్పుడే అంతా అయిపోయింది
పాలదుత్త వంటి వూరుబంధం
ముక్కలుముక్కలైంది



ఆనవాలు * పప్పుల రాజిరెడ్డి



# పప్పుల రాజిరెడ్డి

# ఆనవాలు

కవిత



# AANAVAALU

## PAPPULA RAJIREDDY

Collection of Poems

*Published by*
**Manjeera Rachayithala Sangham**
17-112, Thoombai, Srinagar Colony
SIDDIPETA - 502 103. Ph.: 08457-224877

*First Edition :* November 2008

*Cover Painting:* **Chitra**

*Inner Photos:* **M. Buchirajam Reddy**, Dubbaka

*Cover Design:* **Sita**

*Copies available at* **:**
**P. Raji Reddy**
P.O. Mothey, Man.: Mirdoddy, Via Dubbak, Medak Dist.-502 108.
**Visalandhra Book House,** Hyd. and its branches in A.P.,
**Navodaya Book House,** Badichowdi, Hyderabad,
**Disa Pustaka Kendram,** Chikkadpally, Hyderabad,
**Sahachara Book House,** Baghlingampally, Hyderabad.

*Composed at:* **Akshara Creators,** AG-2, A-Block, Mathrusri Apts., Hyderguda, Hyderabad. Ph: 23244088

*Printed at:* **Charita Impressions**, Azamabad Industrial Area, Hyderabad. Phones: 040 - 27678411, 55295078

Rs. **45.**

తెలంగాణ
బతుకుపోరులో
సమిధలైన రైతులకు...

ముందుమాటతో **అనవాలు**కు తొవ్వదీసిన ప్రముఖ కవి, కేంద్రసాహిత్య అకాడమీ అవార్డుగ్రహీత కె. శివారెడ్డిగారికి

దశాబ్దం పైబడి, నా కవిత్వాన్ని పరిశీలిస్తూ, ఎప్పటికప్పుడు ప్రోత్సహిస్తూ, పుస్తకం వేయాలని సలహాలు, సూచనలు అందించిన ప్రముఖకవి తెరవే వ్యవస్థాపక అధ్యక్షులు డా॥ నందిని సిధారెడ్డిగారికి

ప్రజాసాహితి, ఆంధ్రభూమి, ఆంధ్రజ్యోతి, వార్త, నేటినిజం, ఆంధ్రప్రదేశ్, ప్రకృతిసాహితి, అధ్యాపకజ్వాల, ఉపాధ్యాయ, మరియు ఉత్తరాంధ్ర సంపాదకులకు...

ఆలిండియా రేడియో హైదరాబాదు అధికారులకు...

పాక్కిలి, నాయిన, చుక్కపొద్దు, మానవీయం, కవితావార్షిక, పాట సంతకం, ఎడపాయలు ప్రత్యేక కవితాసంకలనాల బాధ్యులకు...

మంజీరా, తెరవే, ఎ.పి.టి.యఫ్., డి.టి.యఫ్., టి.ఆర్.టి.యు., పి.ఆర్.టి.యు., టి.ఎన్.జి.వో జర్నలిస్ట్ యూనియన్ మిత్రులకు...

అప్తులకు, ఆత్మీయులకు, మా సమిష్టి కుటుంబసభ్యులకు...

**కృతజ్ఞతలు**

## నాలుగు వాక్యాలు

### కె. శివారెడ్డి

*"The eternal silence of these infinite spaces frighten me"*

**PASCAL**

నాలుగు వాక్యాలు రాయటం ఎంత కష్టమో ఇతరుల కవిత్వాన్ని చదివి- ముందు మాటో, మరోమాటో- చదువుకోవటం వేరు. చదివి అనుభవించి, అనువదించటం వేరు. దీనికీ సమాధి గతం కావాల్సినంత పని. అది వెంటపడుతూ వుంటుంది. నిత్యనైమిత్తిక కార్యకలాపాల్లో నువ్వు మునిగిపోయినా- ఎక్కడో లోలోపల అది సంచరిస్తూ వుంటుంది. ఏ మాట చాటునో నక్కి కూర్చుని మీదపడటానికి సిద్ధంగా వుంటుంది. తప్పించుకోవటం కష్టమౌతుంది. అది వెంటాడుతూ వుంటుంది. వదలదు, నిన్ను నిలవనీయదు. విలవిల్లాడుతూ, బండి నెట్టుకొస్తుంటావు. చాలా సార్లు అనుకున్నా- యింత యాతన దేనికి? పప్పుల రాజిరెడ్డి దుఃఖపడ్డాడు; తన్ను తాను ఎన్‌కౌంటర్ చేసుకున్నాడు, చేసుకుంటూ పోతున్నాడు. ఆ ఎన్‌కౌంటర్‌లో నేను భాగం గావటమేమిటి? దుఃఖపడటమేమిటి- విశ్రాంతి లేకుండా, నిర్నిద్రంగా, లోలోపల గొణుక్కోవటమేమిటి?

కవిత్వం చదివిన ప్రతివాడికీ యిదే స్థితి సంభవిస్తుందా? తెలియదు. ఒకరకంగా రాజిరెడ్డి అనుభవించిన నరకాన్ని నేనూ అనుభవిస్తున్నా- ఇందులో ఏమన్నా రాక్షసా నందముందా- హరిశ్చంద్ర నాటకం చూసి ఏడ్చి ఏడ్చి, ఇంటికి రావటంలాంటిదా- ఏం పొందుతాం ఇంత దుఃఖంలోనూ, యింత ఘర్షణలోనూ, యింత పరితాపం లోనూ. ఒక శాంతి, ఒక స్పష్టత దొరుకుతుందేమో. 'పాట పదములకై వేటాడు బతుకు నాది' హాయిగా కవిత్వం రాశాడనుకున్న కృష్ణశాస్త్రి అనవరతం దుఃఖ పడ్డాడు. ఏదో ఒక విముక్తి దొరుకుతుంది- కైవల్యం కాదు. ఆత్మవిముక్తీ కాదు

అభివ్యక్తి విముక్తి- వ్యక్తీకరణ ద్వారా పొందే ఒక ఊరట, ఒక ఓదార్పు. ఎవరో నెత్తిమీద చెయ్యేసి రుద్దుతారు. కళ్ళు అర్ధనిమీలితాలయి- ఒక అపూర్వహాయి అనుభవిస్తూ- బద్దలవుతున్న హృదయ ప్రకంపనల్నుంచి హృదయాన్ని గట్టిపర్చుకోవటం- కీకారణ్యం మధ్య ఒక దారి దొరకటం- అకస్మాత్తుగా ఒక వెలుగు మన ముందు ప్రత్యక్షమవ్వటం- ఏడ్చిన తర్వాత కళ్ళు తేటపడటం- చూపు నిర్మలమవ్వటం.

పరమ శాంతంగా, నెమ్మదిగా, అమాయకంగా కనబడే రాజిరెడ్డిలో ఇంత సంచలనమా- ఇంత తన్నుకులాటా- ఎవరు రమ్మన్నారయ్యా నిన్ను ఈ కవిత్వ కదన రంగంలోకి? సుఖం లేదు- ఒక యుద్ధాన్నుంచి, మరో యుద్ధానికి ప్రయాణమే. బరువు దించుకునే మార్గం లేదు- పళ్ళు బిగబట్టి బరువు మోస్తూ ప్రయాణించాల్సిందే. ఇది సుఖమా! ఏమో? బరువు మోయటం అంటే బాధ్యత మోయటమే. బరువు మోసేవాళ్ళని, బాధ్యతలు నెరవేర్చేవాళ్ళని మాటకోసం బతికేవాళ్ళని అడగండి! ఒక లోర్కా నడగండి, ఒక సెంఘూర్‌ని అడగండి, పోనీ నెరూడా నడగండి- పోనీ, శ్రీశ్రీని, చెరబండరాజుని- ఇలా ఎవర్నైనా అడగండి. ఏం సమాధానం చెబుతారు- ఆలోచనామగ్నమయిన తల పైకెత్తి ఎదురుగ్గా నుంచున్న కవితను చూస్తూ, కళ్ళతోనే మనకు చూయిస్తారు.

పప్పుల రాజిరెడ్డి నన్ను అడుగుతున్నాడు- నన్నావాలు పట్టగలవా, నా ఊరిని, నా వాళ్ళని, నా ప్రాంతాన్ని ఆనవాలు పట్టగలవా! ఆనవాళ్ళు లేకుండా చేసే కార్యక్రమమేదో మొదలయిందని గ్రహించి ఆనవాలు పట్టమంటున్నాడు. ఎవణ్ణి వాడు ఆనవాలు పట్టాలి. త్వరత్వరగా అంతరించిపోతున్న వాటన్నింటినీ ఆనవాలు పట్టాలి. కవి ఈ బాధ్యత తీసుకున్నాడు. తన్ను తను గుర్తుపట్టే పనిలో- అన్నింటినీ గుర్తుపట్టే ఒక బృహత్తర కార్యక్రమం పెట్టుకున్నాడు. గత రెండు దశాబ్దాలుగా మారుతున్న స్థితులు మారుతున్న దృష్టి- మారుతున్న విలువలు- తను పుట్టి పెరిగిన నాటి పరిస్థితి వేరు, ఊరు వేరు, మనుషులు వేరు, ప్రేమలు వేరు, తినుబండారాలు వేరు, ఆనందాలు వేరు, అభిమానాలు వేరు. అంతా చూస్తుండగానే అంతర్ధానమయ్యే పరిస్థితి. కవి తట్టుకోగలడా? శత్రువును ఆనవాలు పట్టాడు- ఇంటాబయటా వున్న శత్రువు. ఒక ఊపిరాడని స్థితి నుంచి ఆక్రందన.

*రంగుల వలలో ఈదులాడుతున్న*
*చేపపిల్లల్ని చూస్తుంటే*
*గుండె తరుక్కుపోయి ఘనీభవించిన బాధ*
*బుగులు గొలిపే పీడకల*



యిప్పటి బాల్యాన్ని, ఆటల్లేని బాల్యాన్ని, మురిపాల్లేని బాల్యాన్ని, చదువు తప్ప ఏమీ లేని బాల్యాన్ని చూసి పడ్డ బాధ-

*కోతికొమ్మచ్చి ఆటలుగానీ*
*ఉప్పుబందరుగానీ*
*దాగుడుమూతలుగానీ- ఏవీ*
*ఏ క్షణాన ఆ లోహపు వృక్షం*
*మా పెరటిచెట్టు నుంచి ఎదిగి బుజాలు ఎగరేస్తూ*
*సిల్వర్ నవ్వులు విసిరిందో*
*ఏ ముహూర్తాన మా వూరి డాబాలపై*
*సాలెగూడు వంటి చెత్తిరి వలలు*
*మొలుచుకొచ్చాయో*

ఇంట్లోకి ఒక టి.వి. వచ్చింది, ఇంటి మీద ఒక యాంటెనా మొలిసింది. పల్లెటూరి పిలగాడు రాజన్న ఈ మార్పును తట్టుకోలేకపోతున్నాడు.

*మనం ఎక్కిన కొమ్మను*
*మనమే నరుక్కోవటం*
*మనకు మనమే మనల్ని కోల్పోవటం*

ఆధునిక విషాదమంతా మనల్ని మనం కోల్పోవటంలోనే వుంది. కవి రాజిరెడ్డికి విషాదం తనని తాను కోల్పోవటం కంటే సమస్తం తన అస్తిత్వాన్ని కోల్పోతుందని.

*విచ్ఛిన్నతకి పాదువేసి నీరు పోయటమే*

సమస్తమూ విచ్ఛిన్నమౌతున్న దశను కవి చూశాడు. పల్లెలు మారిపోతున్నాయి. మారటం గాదు, విచ్ఛిన్నమవ్వటం- ధ్వంసమవ్వటం.

*ఊరిప్పుడు బతికున్న శవాల దుఃఖాల జాతర*
*హక్కుల్ని కోల్పోయిన మూగజీవాల దైన్యపు చూపు*

అభివృద్ధి జరిగిందా? జరిగితే ఆ ఆనవాళ్ళు ఎక్కడ కనబడాలి. సహజంగా 80 శాతం పల్లెలున్న దేశంలో గ్రామాల్లో కనబడాలి. గ్రామీణ అభివృద్ధి కోణం నుంచి అభివృద్ధినీ, దాని సారాన్ని కొలవటానికి ప్రయత్నం. పల్లెలు వల్లకాళ్ళు అవుతుంటే పూర్వపు ఆనందాలు పోయి, సామూహిక విందులు, వినోదాలు పోయి, ఒకళ్ళనొకళ్ళు ఆదుకోవటాలు పోయి- ఏమి అభివృద్ధి! గత రెండు దశాబ్దాల్లో, ముఖ్యంగా

గత దశాబ్దిలో తను చూసిన తననుభవించిన, తన చుట్టూ జరుగుతున్న దాన్ని అంచనా వేయటానికి ప్రయత్నం.

ఏ మార్పయినా మానవుణ్ణి ఉన్నత మానవుణ్ణి చేయాలి. మానవ సంబంధాలు బలపడాలి. అన్యోన్యతలు పెరగాలి. పట్టించుకోవటం కనబడాలి. మానవుణ్ణి అమానవుణ్ణి చేసేది మంచి మార్పెలా అవుతుంది? మానవ సంబంధాలన్నీ విచ్ఛిన్న మవుతున్న దశను ఏ రకంగా కీర్తించాలి.

'బలవంతపు చావుల్ని స్వాగతిస్తున్న వ్యవస్థ' అనీ, వ్యవస్థ, అవ్యవస్థల నిర్మాతల మీదే యుద్ధం-

*మనిషిని అంచనా వేయటమంటే*
*ఎప్పుడూ అంత సులభంగాదు*
*అదొక నిరంతర ప్రక్రియ*
*లోలోతుల్లో అధ్యయనం చేస్తూ*
*అట్టడుగును తడుముతూ అన్వేషిస్తూ*
*ఏ సందర్భమూ ఏ సమయమూ అంత సులభం కాదిప్పుడు*
*ఏండ్ల అనుభవ నైపుణ్యాన్ని నిర్మాణ పునాదుల్ని*
*పెకిలించే ప్రయత్నాలు ముమ్మరమౌతున్న కాలం-*
*కంటి కానని తెగులు*
*పంటచేలలో నవనవలాడే కలుపును గుర్తించాలి*
*వంచనాశిల్పాన్ని ధ్వంసం చేసే*
*అంచనాశిల్పాన్ని పెంపొందించాలి*

అంటాడు.

వరదగుడి మొదటి కవితాసంపుటి దగ్గర నుంచి ఒక పదేళ్ళ ప్రయాణం. పదేళ్ళ జీవితం- పదేళ్ళ సంక్షోభం- ఒక పదేళ్ళ అల్లకల్లోలం తర్వాత- మాట్లాడుతున్నాడు రాజిరెడ్డి. ఇంకా మూలాల్లోనే కాళ్ళున్న రాజిరెడ్డి- మార్పుల్నీ, మార్పుల ఆంతర్యాన్నీ, లోతుల్నీ అంచనా వేస్తున్నాడు. ఎక్కడా జీవితం ప్రశాంతంగా లేదు. సంకీర్ణమై, సంక్షోభమై- అగమ్యంగా తయారవుతున్న దశలో నలుగుతున్న మనిషి- ఈ పదేళ్ళ అనుభవాన్ని ఇదిగో ఇక్కడ గుదిగుచ్చాడు. తను కేంద్రంగా తనలోంచి ప్రయాణి స్తున్నవే అన్నీ- ఏవీ బయట లేవు. బయట వున్నవన్నీ లోపల వున్నాయి. భౌగోళిక మార్పులే కాదు- జీవనసరళిలో వస్తున్న మార్పులే కాదు- చింతనలోనూ, మానసిక ప్రపంచాల్లో జరుగుతున్న మార్పులు భయంకరమై- తట్టుకోలేని స్థితికి నెడతాయి.



కవిత ఒక నిర్మాణం- ఆ నిర్మాణ కార్యక్రమం వెనక ఉన్నది యంత్రంగాదు- ఒక బతికున్న మనిషి, ఆ మనిషి భావనలు, ఆవేశాలు, ఉద్రేకాలు, ఆక్రోశాలు, ఆకాంక్షలు అన్నీ- అన్నీ అతన్నుంచి బయటికి చొచ్చుకొస్తాయి.

*ఒక తోటను నిర్మించాలి*
*సహనమూ, గుండె నిబ్బరమూ*
*సంయమనం*
*చీకటిదారిని ఛేదించాలి*
*ముండ్లవనాల్ని పండ్లవనాలు చేయాలి*

అదీ శపథం.

మధ్యలో పాఠకుడున్నాడే. నీలో జరుగుతున్న సమస్తం వాడికి నివేదించాలి. వాడికి అందాలి. వాడూ కదలాలి. కవిత్వ నిర్మాణమూ ఒక తోట నిర్మాణం లాంటిదే- సహనమూ సంశయనమూ దీనికి అవసరమే- మనిషితనంలేని డొల్ల మనుషుల సమూహం మధ్య తనెలా బతుకుతాడు- తను ఒక సుందర ఉద్యానవన నిర్మాణంలో ఉన్నవాడు-

*భూమితల్లి వీరులకు ఊపిరిపోసి*
*కొత్తలోకాల్ని కలగంటుంది*

కవీ అంతే- రాజ్యాన్ని, దాని రాక్షస ప్రవృత్తినీ అర్థంచేసుకోకుండా, దాన్ని నిర్మూలించ కుండా- కొత్త నిర్మాణం జరగదని.

పప్పుల రాజిరెడ్డి- మంజీరా రచయితల మలితరం కవి. తొలితరం కవులకు లేని సౌకర్యం, మలితరం కవులకుంటుంది. వీళ్ళు రంగం మీదికొచ్చేసరికే ఒక భూమిక తయారయి వుంటుంది. ఒక దిశానిర్దేశమూ జరిగి వుంటుంది. పూర్వరంగం కల్పించిన ఒక వాతావరణం వుంటుంది. నిజానికి మలితరం కవులకు దేన్నయినా అందుకోవటం తేలికవుతుంది. ముందు నడిచే వాళ్ళుంటారు కాబట్టి- అయితే ఇంత నేపథ్యమున్నా ఇంత వాతావరణమున్నా- అందరిలో, అందరితో కలిసి నడుస్తూ తన దోవ తను వెతుక్కోవాలి, వేసుకోవాలి. ఒక సిధారెడ్డి ఛాయలు కనబడకుండా చూసుకోవాలి. తనదయిన అనుభవం నుంచి, తనదయిన వ్యక్తీకరణతో పలికే నేర్పు సాధించుకోవాలి. తన ముందున్న వాళ్ళ కవిత్వసారాన్ని గ్రహించి తనదయిన కవిత్వం, తన జీవితం నుంచి, తన అనుభవం నుంచి తన్నుకొచ్చే కవిత్వం రాయాలి. ఇది తేలిక కాదు. అసలు ఏ తరానికా తరం తనదయినదాన్ని దేన్నో తప్పక వెతుక్కోవాల్సిందే.

ఒరిజినాలిటీ అంటామే- దాన్ని సాధించటానికి ప్రయాసపడాల్సిందే. తన ప్రయాణం తను చేయాల్సిందే. అందుకే తనదయిన తన భాషను తాను నిర్మించుకోవాలి. తన పదాన్ని, తన పోలికల్ని తను శోధించాల్సిందే- ఏరుకోవాలి.

రాజిరెడ్డి కవిత్వం మొదలెట్టిన నాటి నుంచి ఈ కార్యక్రమంలోనే వున్నాడు. వరదగుడిని ఈ కవితా సంపుటి ఆనవాలును పోల్చండి. ఎదుగుదల ఏమిటో అర్థమౌతుంది. వ్యవసాయిక గ్రామీణ నేపథ్యం నుంచి వచ్చిన రాజిరెడ్డి థీమ్ అంతర్లీనంగా కదిలే వస్తువు మొత్తం- ఇమేజనరీ మొత్తం అక్కడ నుంచే. అది ఆయన నేటివిటీ- ఆయన తత్వం, స్వభావం, ఆయన జీవనతత్వం- ఆయన అన్నింటినీ ఎలా అందుకుంటాడు, ఆస్వాదిస్తాడు, వివేచిస్తాడు- అన్నీ ఆయన స్వభావం మీదే ఆధారపడి వుంటాయి, వున్నాయి. ఏ కవితా మహోద్రేకంతో కదలదు. సంక్లిష్ట సంక్షోభభరితమయినా రూపం మాత్రం అలా వుండదు. సరళంగానే, సాదాసీదాగానే- అచ్చంగా పప్పుల రాజిరెడ్డిలానే వుంటుంది. రెండోసారి చదివితే రాజిరెడ్డి కవిత్వాన్ని ఎక్కువ ఆనందిస్తారు. మొదటిసారికే పాఠకుణ్ణి చెదరగొట్టి ఆకర్షించే తత్వం రాజిరెడ్డిదిగాదు. కాళ్ళకి చెప్పులు లేకుండా భుజాన పైగుడ్డతో చేతిలో కర్రతో పొలానికెళ్ళే రైతులా వుంటుంది.

కాయలుగాచిన కష్టం గుర్తులు కవిత చదవండి. అద్భుతమయిన కవిత. కూరగాయలమ్మే స్త్రీ మీద రాసిన కవిత. అద్భుతంగా బొమ్మ కట్టాడు.

*పనిషోకేగానీ, బట్టషోకు, పెయ్యిషోకు లేనివాళ్ళు*
*ఉత్తగ వుండటం తెలియనివాళ్ళు*
*మన బాధ్యతల్లో వీళ్ళే ఆదర్శం*
*మన మాటల్లో వారి సూటిదనం*
*మన ఆచరణలో వారి పనితనం*
*అంతర్లీనమవ్వటానికి- ఫలవంతమై వెలగటానికి*
*కొసరంత త్యాగానికి సిద్ధమౌదాం*

ఆఖరి వాక్యం చాలా కీలకం. *కొసరంత త్యాగానికి సిద్ధమౌతాం*- స్వార్థం బలిసి పోతున్న సందర్భంలో 'కొసరంత త్యాగం' అవసరాన్ని గుర్తు చేయటం.

బహుళ ప్రపంచీకరణ- దాని ఫలితాలు, దాని విధ్వంసాన్ని ముందుగా పసికట్టిన వాళ్ళు మంజీరా కవులే. ప్రపంచీకరణ, సరళీకరణ, వ్యాపారీకరణ- దాని ఫ్రాగ్మెంటేషన్ మీద ఇంత ప్రచారం జరగకముందు, ఇంత సాహిత్యం సృజించక



ముందు మంజీర కవులు- ఎడపాయలు అనే కవితా సంకలనం తెచ్చారు. ఈ ప్రపంచీకరణ ప్రమాదాన్ని ముందు పసిగట్టి పలికిన తొలి కవితాసంపుటి. అందులోనూ రాజిరెడ్డి కవితలున్నాయి. విశేషమేమంటే రాజిరెడ్డి ప్రధాన వస్తువు ఈ సంపుటిలోనూ అదే. ఈ కవితాసంపుటి అంతఃస్రవంతి అదే. ఎక్కువ కవితలు అది తీసుకువచ్చిన విధ్వంసం మీదే. గ్రామాలు, వాటి అభివృద్ధి కోణం నుంచీ సమస్తాన్నీ విశ్లేషించటం- అదే కొలమానం. తను చూస్తున్నది, అనుభవిస్తున్నది అదే. మానవ సంబంధాల విచ్ఛిత్తికి అదే మూలమనే భావన. ఆనాటి తిళ్ళు లేవు, వేడుకలు లేవు, ఆటల్లేవు. అందరూ కలిసి పంచుకొనే ఆనందాలు లేవు- నగరానికీ పల్లెకూ తేడాలేని స్థితి. ఏకాకితనం. ముక్కలవటం.

*కన్నతల్లి వంటి చెరువు ధ్వంసం*
*కల్పవృక్షం వంటి పూరు ధ్వంసం*
*పాడిబర్రె వంటి వాగు ధ్వంసం*

*సంచులకొద్దీ పంట ధాన్యాగారం*
*నేడొక కారాగారం*

*పసులగోస, యాతన, దాహం, సాపెన, గాలి సోకిన ఊరు* కలవరింత ఇత్యాది కవితల్లో భిన్న వస్తువులయినా థీమ్ ఒకటే- పల్లె కల చెదరటం, పల్లె విలవిల్లాడటం.

జ్ఞాపకాల ముసురు మరొక మంచి కవిత. గతాన్ని వర్తమానంతో పోల్చి, కోల్పోయిన వాటిని తలుచుకొని దుఃఖపడటం.

*ఎన్ని చూసినం ఎన్ని చేసినం, ఎక్కడిదాకొచ్చినం*
*ఇప్పుడెటు జూడు అంతా వెలితి వెలితి*
*ఎండిపోయిన బీడులు సర్కారుతుమ్మలు*
*తుప్పలు మొలిసిన బాయి బొందలు*
*దుమ్మురేగిన బోరు పొక్కలు*
*లారీ లెక్కిన పశువులు, తర్లిపోయిన ఇసుకలు*
*బోసివోయిన వాగులు*
*పెట్టేబేడా సర్దుకుని బస్టాండులో*
*బావురుమనే దుఃఖపు సముద్రాలు*
*తాయిమాయి బతుకులు చెంచరిల్లి మనసులు*

మొత్తం ఈ విషాదపు దృశ్యాన్ని కళ్ళకు గట్టింది ఆనవాలు కవితా సంపుటి. ఒక దుఃఖపు జీర వుంది, దాని పక్కనే ఒక వెలుగురేఖా వుంది.

ఒక దశాబ్దంగా రాస్తున్న కవితలు ఇవి. కవిత్వం రాస్తున్నా, పుస్తకం తేవటానికి చాలా తాత్సారం చేశాడు. ఆత్మఘర్షణలూ, సంసారపు వత్తిళ్ళు- యింకా సవాలక్ష కారణాలుంటాయి చెప్పుకొంటే. అవన్నీ సాకులే, మనల్ని మనం సమర్థించుకుంటానికి పనికొచ్చేవే. ఎక్కడో ఒక నిర్ణయం, ఒక తీవ్రతా కొరవడింది. కవిత్వానికి రెండో స్థానం ఇవ్వటం జరిగిందా-

రాజిరెడ్డీ! ఏదీ అస్పృశ్యంగాదు- సమస్తం కవిత్వంలోకి రావాల్సిందే. ప్రతి కదలికా, ప్రతి చలనం, ప్రతి స్పందన కవిత్వంగా ఎలా మారుతుందో గమనించాలి. నీ వత్తిళ్ళు నిన్ను కరిగిపోయేట్టు, మహోష్మృదవయ్యేట్టు చేయాలి. బండబారకుండా వుండటానికి చెయ్యాల్సిందేమిటి? చలనశీలాన్ని సృజనశీలాన్ని కాపాడుకోవాలి.

ఇన్నేళ్ళ తర్వాతయినా ఇదిగో నేనున్నానంటూ ఒక కేక వేసినట్టు ఈ పుస్తకం. ఈ కేక ఇన్నాళ్ళ నుంచీ ఆయనలో సుళ్ళు తిరుగుతూనే వుంది. నేటికది ప్రతిధ్వనించింది. అన్నీ సర్దుకుని ఒక దోవకి వచ్చిన తరుణంలో రాజిరెడ్డిని కవిత్వం మీద ఎక్కువ దృష్టి పెట్టమని కోరుతున్నా- నలుగురిలో నిన్ను సగర్వంగా నిలబెట్టే, తలెత్తుకుని తిరిగేట్టు చేసే కవిత్వాన్ని చిన్నచూపు చూడొద్దు.

ఇక కవిత్వమే సర్వస్వమై బతకమని-

అభినందనందిస్తూ...

*25 సెప్టెంబర్ 2008, హైదరాబాద్*



# ఆకుపచ్చ దేశం

కామెర్ల రోగికి లోకమంతా
పచ్చగా కన్పించే మాటేమోగానీ
వాళ్ళకు మాత్రం దేశమంతా
ఆకుపచ్చగానే కన్పిస్తుంది

పథకాల వేషంలో అభివృద్ధి
తాటాకుల గలగల చేస్తూ
ఆలోచనలను హైజాక్ చేస్తుంది
నోరుండీ కళ్ళుండీ నోటిలో మాట వుండీ
బొమ్మలమైపోతాం
తకథిమి తకథిమి తోలుబొమ్మా...
చోద్యరాగం సామూహిక తాళం
కొట్టిన గండిని పూడ్చటానికి
సరికొత్త వ్యూహాలు మొలుచుకొస్తాయి
మందు కావాలనే నినాదాన్ని
మందికే అప్పగిస్తాయి

ఆర్థిక స్థితిగతుల లబదిబలకు
శ్వేతపత్రాలు తెల్లబోతాయి



గల్లాపెట్టె దివాళాకోరుతనం
జీతభత్యాల నోరు మూయిస్తుంది
రాజదండం తల్చుకుంటే
వరాలకు కొదవా దెబ్బలకు కొదవా
మందను మలిపే యత్నంలో
మరో పన్నాగం ముందుకు వస్తుంది
ప్రజలారా మన వూళ్ళో
గొప్ప బహిరంగసభ
శ్రమదాన చరిత్రం పురఫ్ జన్మభూమి వృత్తాంతం
పిల్లలూ పెద్దలూ వృద్ధులూ
ముఖ్యంగా విద్యార్థులు టిక్కెట్లు ఉచితం
మీరే పాత్రధారులు ప్రేక్షకులు
మీ వూరు మీ యిష్టం

✧ ✧ ✧

పార ముఖం తెలియని ముతక ఖద్దరో
తట్టను మట్టిని ముట్టని సిల్కులాల్చీయో
వాహనాల్లో ఊరేగుతూ
పురమాయించే అధికారగణమో
వీడియో కెమెరాల ముందు దాసోహమవుతుంది
వార్తల్లో బతకటానికి నానాగడ్డి కరుస్తుంది
ఇష్టంగానో అయిష్టంగానో
వారంరోజుల తంతు- తూతూ మంత్రమవుతుంది
మే ఎండల్లో ఆగస్టు వానల్లో నవంబర్ చలిలో
విడతల అవతారమై జోకొడుతుంది

✧ ✧ ✧





బ్యాలెట్ సంతతికి మాత్రం
దేశం పచ్చగానే కన్పిస్తుంది
సర్కారు బడుల చవకబారుతనాన్ని
కానిగిరి చదువులు అపహాస్యం చేస్తాయి

స్టార్‌హోటళ్ళ విలాసాలు
సూపర్ స్పెషల్ దవాఖానాలు
కావిరంగు గోచీ మానధనుడికి
మయసభలవుతాయి

పజ్జొన్న పేలాలు పాలు ధనియాలు వగైరా
ప్యాకింగ్ సంస్కృతిలో ముస్తాబై దర్శనమిస్తాయి
అభివృద్ధి నాలుగు పాదాల దేకుడు నడకలో
వాళ్ళకు మాత్రం దేశం పొద్దుతిరుగుడు చేనులాగే...
మనం మనకు తెలియకుండానే అమ్ముడుపోతాం
కార్పొరేట్ దయ్యం గాలి సోకి పచ్చబడిపోతాం

ఊళ్ళు గాబరా పడతాయి
పట్నాలు కాసుల పంటలవుతాయి
ఏళ్ళ తరబడి చేసిన కష్టం
నిచ్చెన మెట్ల వైకుంఠపాళిలో
బోర్లా పడి గుడ్లు తేలేస్తుంది

రాజ్యం నోట్లోంచి రాలే అభివృద్ధి
మాటెత్తగానే-
సగటు మనిషి వొళ్ళంతా
పారుతున్న జెర్రులవుతుంది

వాళ్ళకు మాత్రం దేశం
సుభిక్షంగానే కన్పిస్తుంది



వాళ్ళకు మాత్రం దేశం నిండు చెరువులాగే...
కొరియా వలెనో జపాన్ వలెనో
కళ్ళలో కదలాడుతుంది
పసుపుపచ్చ దేశానికి
దేశం ఆకుపచ్చగానే అగుపిస్తుంది

*25 జనవరి 1997*

*ప్రజాసాహితి, ఎడపాయలు కవితాసంకలనం*
*అక్టోబర్ 2001*





# పడగ నీడ

రంగుల వలలో ఈదులాడ్తున్న
చేపపిల్లల్ని చూస్తుంటే
గుండె తరుక్కుపోయి ఘనీభవించిన బాధ
బుగులు గొలిపే పీడకలగా తలపిస్తుంది

ఏ కాలుష్యం అంటని ఊరు బాల్యం
ఎదుగుతున్న గోధుమ చేను వంటి లేలేత
చిగురు బాల్యం
చడీ చప్పుడు మాని
ఇడియట్ బాక్సులో బంధీకృతమవుతుంది
ఎవరు చెప్పినా ఎంత చెప్పినా
వినిపించుకోని మైకపు ఆకర్షణలో
కళ్ళూ చెవులూ అటువైపే లాగుతుంటాయి
ఒకప్పుడు ఇంటి ముందో
వెనకాలో వున్న
పచ్చని చెట్ల నీడలు చల్లగా మాట్లాడేవి
ఆటలకు ఆటపట్టులై పాటలు పాడమనేవి
అరుగులు కిలకిలలతో కిటకిటలాడేవి



మేమంతా కథలపేటిక అమ్మమ్మ
దాపున చేరి చెవుల్లో మనసు పెట్టి
శ్రద్ధగా వినేవాళ్ళం

కోతికొమ్మచ్చి ఆటలుగానీ
ఉప్పు బందరుగానీ
దాగుడుమూతలు గానీ అష్టచెమ్మలుగానీ
ఆడుకునేవాళ్ళం
ఆనందాల ఊటల్ని చిరు చిరు కోపాల
గారాబు మాటల్ని ప్రేమగా పంచుకునేవాళ్ళం
ఇప్పుడవి మచ్చుకైనా కన్పిస్తున్నాయా
ఊహల్లో తప్ప దృశ్యాల్లోనైనా తేలుతున్నాయా
ఏ క్షణాన ఆ లోహపు వృక్షం
మా పెరటిచెట్టును మించి ఎదిగి, భుజాలు ఎగరేస్తూ
సిల్వర్ నవ్వులు విసిరిందో-
ఏ ముహూర్తాన మా వూరి డాబాలపై
సాలెగూడు వంటి చెత్తిరి వలలు
మొలుచుకొచ్చాయో
అప్పుడే అంతా అయిపోయింది
పాలదుత్త వంటి వూరుబంధం ముక్కలు ముక్కలైంది
ఆటాపాటా ఆవిరైపోయింది
మాట్లాడే బొమ్మలపెట్టె ఒక్కతే
దర్జాగా తిష్ఠ వేసింది
అయస్కాంత ప్రసారాల సమ్మోహనమై
అల్లుకుంది
పొద్దు రాలటమే ఆలస్యం
మసక వెల్తురు- పిల్లల స్పర్శలేక వెలవెలబోయింది
వెన్నెల ఒంటరిపక్షి అయింది





చాకలి ఊరు తిరిగే సమయమే
అర్ధరాత్రిగా తోస్తుంది
అంతా వెలితి వెలితి
వీధుల బోసితనం
చావడి దగ్గర గుమిగూడే పొలంపనుల వలపోతలు
అరుగుల మీది అమ్మలక్కల ఆశువులు-
అచ్చట్లూ ముచ్చట్లూ అన్నీ చిన్నాభిన్నం
పరస్పరం ముచ్చటించుకునే సమయం లేని
సామూహిక ఒంటరితనం

మనలోకి మనమే ఒక ఊహాజనిత భ్రమపూరిత
రంగు రంగుల వలయాల వలల్లోకి-
అలవోకగా నెట్టబడుతాం
ఆప్యాయంగా వచ్చిన బంధువునైనా
ప్రేమతో పలకరించలేం
అంతా పైపై మెరుగులతనం

ఎంతో ఎదిగామన్న అత్యాధునిక సంస్కారం
మనమెటు పోతున్నామో
మనతర మేమవుతుందో
మన గోతిని మనమెలా తోడుకుంటున్నామో
తెలిసే యిదంతా జరిగిపోతుంటుంది

మనం ఎక్కిన కొమ్మను
మనమే నరుక్కోవటం
మనకు మనమే మనల్ని కోల్పోవటం
విచ్ఛిన్నతకు పాదువేసి
మరీ నీరు పోయడమే అవుతుంది

*8 ఫిబ్రవరి 1997*

*ఆంధ్రజ్యోతి ఆదివారంఅనుబంధం*
*9 మార్చి 1997*



# జె.సి.బి.

అంతా ప్రశాంతంగానే కన్పిస్తుంది
అన్నీ సవ్యంగానే సజావుగానే వున్నట్టు-
రాత్రీపగలు లేవటాలు పడుకోవటాలు
దినచర్యలు
వాగులాంటి గంభీరత
కష్టాలు ఆవేదనలు కడుపులో కుక్కుకొని
జీవితం భయంభయంగా అభద్రంగా
ప్రవహిస్తూ వుంటుంది
నిర్మూలనే ధ్యేయమై తటాకంలో రాయి విసరటం
జనసమూహాల్ని బెదిరింపు తాడుతో బంధించి
నోరు మూయించాలనుకోవటం తగదు
దయా లేదు దాక్షిణ్యం లేదు
ప్రేమ జాలి వెదికినా కన్పించదు
అవును అదొక జె.సి.బి.
గుత్త పెత్తందారీ చేతిలో కీలుబొమ్మ
ఇప్పుడు ఊళ్ళను కదిపి ఆలింగనం చేసి చూడు
పత్తికాయ పగిలినట్టుగా వుంటుంది దుఃఖం
వరద కొట్టుకపోయిన చేనులా





ఏళ్ళ నుండి కనబడక అప్పుడే ప్రత్యక్షమైన
ఒక్కగానొక్క కొడుకును
దగ్గరికి తీసుకొని వలపోసే తల్లిలా వుంటుంది

✧ ✧ ✧

అవును నిజమే మరి
అదొక ప్రొక్లెయినర్
కాకపోతే ఆరు చదివే
పన్నెండేళ్ళ పాలబుగ్గను
రక్తం మడుగు చేస్తుందా
ఆశతో కట్టుకున్న పిట్టగూళ్ళను చిదిమేస్తుందా
చావును సాధారణీకరించటం సులువే కావొచ్చు
కాకమ్మ కథలల్లి వక్రీకరించి ప్రచార బాకాలూదటం
నీ ధర్మమే కావొచ్చు
అల్లుకుపోతున్న పల్లెల తిప్పతీగ ఉసురు వూరకే పోదు

*11 నవంబర్ 2000* *అధ్యాపకజ్వాల, డిసెంబర్ 2000*



# మా వూరికి కళవొచ్చింది

మా వూరికి కళ వొచ్చింది
అద్భుతమైన కళ- అపురూప కళ
రెక్కల కష్టాన్ని మాయచేసి దోపిడి చేసి
కూలీ బతుకుల్లో కుంపటి పెట్టే కళ
నోట్లో మట్టి గొట్టే కళ
బహుళజాతి కంపనీల ఇనుప కళ
జె.సి.బి. కళ
మా వూరికి కళ వొచ్చింది

✧ ✧ ✧

ఊరిప్పుడు గాలానికి తగిలి
గట్టుపై బడి తల్లడం మల్లడం కొట్టుకునే
నిస్సహాయ చేప బతుకు
దళారీల నరకంలో చావు బతుకుల మధ్య
కొట్టుమిట్టాడే సందిగ్ధ దృశ్యం
ఊరిప్పుడు గాయాల్ని పూచిన మోదుగచెట్టు
మౌననిర్వేదంలో చేతులు వేలాడేసి
బీరిపోయిన శ్రమకు ప్రతినిధి

✧ ✧ ✧





పంటపొలాల ధ్వంసం చేసి
చేపల చెరువుల్ని ఉబికిస్తారు
రొయ్యల పంట వ్యామోహంలోకి
అలవోకగా నెట్టేస్తారు
పెట్టుబడితో పాటు ఆందోళన పెరిగిపోయి
దిక్కుతోచని స్థితి దాపురిస్తుంది
కాసుల పంట పత్తి యాదికొచ్చి
కండ్లల్ల మెరుస్తుంది
ఇప్పుడు చేపల చెరువుల్ని పొలాలు చెయ్యాలి
ప్రాణ సమంగా పైరును రక్షించుకొనే తీరులో
వ్యాపారుల ఎత్తుగడలు ఎరవేసి
మభ్యపెడతాయి
నిలువెత్తు కాయకష్టం సాక్షిగా
పచ్చటి పొలం సాక్షిగా
వెన్నముద్దల్ని కాస్తుందనుకున్న పత్తిచేను
పురుగు ముట్టి విలవిల్లాడుతుంది
దారి తెలియని బతుకు
జాలలేని బొంగరమవుతుంది
విరక్తి రాయి తగిలి అన్నంకుండ
చేను మధ్యలో పగులుతుంది

✧ ✧ ✧

ఊరిప్పుడు బతికున్న శవాల దుఃఖాల జాతర
హక్కుల్ని కోల్పోయిన మూగజీవాల దైన్యపు చూపు
పంటచేన్లో ఆత్మహత్యలు మొలుస్తున్నందుకు బాధ లేదు
వందలకొద్దీ కుటుంబాలు పిట్టసోకాలవుతున్నందుకు
బాధ లేదు
వోటుబ్యాంకు దెబ్బ తిన్నందుకే కోలుకోలేనంత బాధ



కంటితుడుపు సానుభూతి కష్టాల్ని గట్టెక్కించదు
రైతుల్ని ఆదుకోని ప్రభుత్వాలు బతకటమొక విషాదం

తిమ్మిని బమ్మి చేసే బాపతుగాళ్ళ
మాయలు
ఊరికి బాగా తెలుసును
నాగళ్ళ దుఃఖం పట్టించుకోని యంత్రాంగం
చక్రం తిప్పలేదు
బలవంతపు చావుల్ని స్వాగతిస్తున్న వ్యవస్థ
వూరుకు ఏమిచ్చిందనీ- రైతుల కేమిచ్చిందనీ
పుట్టెడు దుఃఖాన్నీ యింత అభద్రతనీ

*14 డిసెంబర్ 1998*

*ప్రజాసాహితి, ఆగస్టు 1999*
*ఎడపాయలు కవితా సంకలనం, అక్టోబర్ 2001*





# వేదనాశకలం

రక్తం రుచి మరిగిన తోడేళ్ళను చూశాం
తన పిల్లల్ని తనే భక్షించే పులుల్ని చూశాం
క్రూర మృగాలను చూశాం
గగుర్పొడిచే విషసర్పాలను చూశాం
మనిషి రక్తం తాగనేర్చిన
మనుషుల్ని చూస్తున్నాం
న్యాయం చట్టమంటూ
శాంతిభద్రతలు వల్లిస్తూ
అశాంతికి ఆజ్యం పోస్తున్న రౌడీతనం చూస్తున్నాం
ఈ ప్రపంచమొక దొంగల కొంప
రంగురంగుల నైలాన్ వలల పంజరం
మాయామోసం దగా దౌర్జన్యం
మాటకారితనం దాని సహజాతం
మనం కొంత సమయం తీసుకుందాం
దొంగ కాని మనిషెవడో అన్వేషిద్దాం
ఔనా,
లెక్కకు మించిన దొంగ తోవల్లో
ప్రయాణం చేసే



దొరకని దొంగల దొర పెత్తనాల స్థావరమిది
జీవించటమొక అందమైన తిరిగిరాని అవకాశం
గొప్పగానో సప్పగానో ఆదర్శంగానో అయిష్టంగానో
ఆ హక్కును తుంచేయటం దుర్మార్గం

జీవితభారం మోయలేని
చాతకాని సందర్భంలో
అలా నా చిన్నతనంలోకి ప్రవహిస్తుంటా
ఎవరి బాల్యమైనా
అందమైన ఊహల్లో
ఆనందాల్లో తేలిపోయే
కలల బొంగరం కాకూడదా
మట్టి చేతులతో మట్టి కాళ్ళతో తిండి లేక
బట్టలైనా సరిగా లేని బాల్యం-
రేపటి కోసం రవ్వంత ఆలోచనైనా లేని బాల్యం
కులాసాగా తోటి స్నేహితుల్తో
బజార్లో ఆటలలోకంలో తేలిపోతున్న బాల్యం
హఠాత్తుగా ఆశ్చర్యకరంగా
రాగిదిమ్మల దొంగతనం కిందా నలిగింది
ఆ చిట్టి చేతులకు
ఆ లేలేత పాదాలకు
ఆ పాలబుగ్గలకు
ఆ కిలకిల నవ్వులకు
ఆ జాలి చూపులకు
బతుకొక శాపమయింది
అభియోగం అభియోగం
చేయని నేరం వొప్పించే ప్రయత్నం
ఆరిపోయిన బాలుడి ప్రాణదీపం





బాబూ రమేష్
ఒక్కసారి ఒక్కసారి లేరా
దిటవుగా అడుగులు వేస్తూ
నిటారుగా నడిచిరా
ఈ వ్యవస్థ ముఖచిత్రంపై లాలాజలగంధం వేయవూ

*10 జూన్ 1999*



# పాటల ప్రవాహం

భూమి పాటకు వూపిరి పోసి
ఉగ్గుపాలు తాపి నడకలు నేర్పిన ఆమె
బతుకు పాటను జనసందోహం నాలుకలపై
మొలిపించిన ఆమె
దోపిడిదారుల గుండెల్లో గునపమయ్యింది
ఆమె వునికి
సింహాసనాన్ని బద్దలు కొడుతుందనే భయం
తెలంగాణ జనజీవితాన్ని తట్టిలేపి
చైతన్యజాగృతం చేస్తుందనే భయం
వణుకు పుట్టించే వుంటుంది
ఆమె చేసిన నేరమల్లా
ప్రజల పాటలు పాడటమే
ప్రజల భాషలో ప్రజల యాసలో
ప్రజల ఆలోచనల్ని పదును చేయటమే
తెలంగాణ అవసరాల్ని ఆశయాల్ని నొక్కి చెప్పటమే
కంచు వంటి గ్రామీణ గొంతుతో
రక్తాన్నీ నరాలనీ ఊపిరినీ ఉద్వేగాన్నీ
ఆవేశాన్నీ చూపుల్నీ కదలికల్నీ రంగరించి





నువ్వు పాటను తూటా చేసే తీరులో-
రోమాంచితం చేసే ఉద్విగ్నభరితమైన పాట
'రాజ్యహింసా పెరుగుతున్నాదో' వినే వుంటాడు
నీటి సమస్య మీద నీ పాట
'సుక్క నీళ్ళు రాకపాయె యెన్నియాలో'
ప్రజల్లో కెళ్ళటం చూసే వుంటాడు
నీ పాట తీరుకు మాట తీరుకు
జడిసే వుంటాడు
కుట్రల కుతంత్రాల వ్యూహం నిలవదు గాక నిలవదు
పాట గొంతును నొక్కిన కాఠిన్యతకు
దాసోహ గీతం పాడటానికి
తెలంగాణ మట్టి పుట్టిదేం కాదు

*1 ఆగస్టు 1999* — *ప్రజాసాహితి, సెప్టెంబర్ 1999*



# సాపెన

**భూ**మిని నమ్ముకొని
బువ్వ కోసం బతుకు నాగేటి చాళ్ళవుతున్న వాళ్ళు
యీ రాజ్యమేమిటో రాజకీయమేమిటో
పంతాలు పట్టింపులు లేనివాళ్ళు
మీ అందాల అద్దాల మేడల చీకటి చరిత్రల రహస్యాలు
ఎప్పుడైనా తవ్విపోయలేదు కదా
మీ ఎస్టేట్లను మీ కంపనీలను
మీ భోగభాగ్యాల ఆడంబరాలను
ఎన్నడైనా ఎప్పుడైనా ప్రశ్నించి ఆరాతీసి
చాటింపు వేయలేదు కదా
మీ సంక్షేమ పథకాల భాగోతాల గుట్టును
మీ కుంభకోణాల చిట్టాపద్దులను
విప్పనైనా విప్పకపోయిరి
పంటపొలమే దేశమైన వాళ్ళకు
బాయిబంధమే బతుకయిన వాళ్ళకు
అంత తీరికెక్కడిది

✧ ✧ ✧





మాయామర్మం తెలియని
గోజల్లాంటి రైతులకు
మన తల్లెల్ల మెతుకులైన వాళ్ళకు
గిన్నెల్లో అంబలై మన గ్లాసుల్లో పాలైన వాళ్ళకు
పాలలాంటి మనసున్నవాళ్ళకు
బుల్లెట్లు సమాధానమవటం ధర్మమవుతుందా
వాళ్ళు సమైక్యమవటం నేరమౌతుందా

ఖాళీ ఖజనా లెక్కలైనా
అడిగినవారు కారైరి
ఎన్నికల జాతర పూనకంలో మోసుకొచ్చిన హామీల
నిలదీసిన వారైనా కారైరి
ఎందుకింత నిర్దాక్షిణ్య రాక్షస ప్రవర్తన
ఓటు వేయటం హక్కుగా తోచినప్పుడు
తోటి మనిషికి హక్కులుంటాయని తెలువద్దా
భూమిని మబ్బుతునకను నమ్ముకున్నవాడికి
సమస్యల వల వేయటం పాలనాసామర్థ్యమా
మోయలేని నీటితీరువా నడ్డి విరుస్తున్నప్పుడు
కరెంటుఛార్జీలు రక్తం పీల్చి షాకిస్తున్నప్పుడు
నాగళ్ళు ప్రశ్నలవటమే బాధ్యత
రైతు సమ్మె కట్టి ఐక్యనాదమైనందుకు
కాల్చటమే రివాజైన అసమర్థ రాజ్యంలో
మనిషి జీవన హక్కును కోల్పోతున్నాడు
హక్కులు లేని దేశం ప్రజాస్వామ్యమెలా అవుతుంది
ప్రజా కంటక రాజ్యమే కానీ-
నాగళ్ళను కూల్చిన చేతులు
అన్నం కుండలో రక్తం వొలకబోసిన చేతులు
చెదలు పట్టకపోతాయా
కాల్దరీ రైతన్నల ఆలుబిడ్డల సాపెన
వూరకే పోదు



# గాలిసోకిన ఊరుబాల్యం

మనిషి పుట్టగానే ఆట
ఏడుపు పాట ఏకకాలంలోనే పుట్టి ఉంటాయి
అలా మొదలై బాల్యంతో
అల్లుకపోయిన ఆట
బాదరబందీ లేని స్వేచ్ఛాతీరంలోకి
బంతిలాగ వచ్చి విహరింపజేస్తుంది
ఆటలు లేని బాల్యాన్ని వూహించటం కష్టం
బాల్యసంబంధం లేని ఆటల్ని బతికించటం మరీ కష్టం
బాల్యం మధురస్వప్నం
తీయని జ్ఞాపకాల పుస్తకం
పేజీ తిప్పితే చాలు ఆటలే ఆటలు
కాలాన్ని మనల్ని మరిపించి ఆనందలోకాల్లోకి మోసుకెళ్ళి
అంత తొందరగా మనల్ని గుర్తుకు తేవు
వూరు ఆటలిప్పుడు అపురూపమే
అప్పటి వూరు బాల్యాన్ని కదిపి చూడు
వేనవేల ఆటల దృశ్యాలు
మనసుకు తుమ్మగోందులా అంటుకుంటాయి
వూళ్ళు ఆటపాటల ఉత్పత్తి కేంద్రాలు





శ్రామిక జనజీవన దృశ్యాల తోరణాలు

ఇప్పుడు వూరు ఆటలు మోటయిపోయినయ్
మరుగునవడ్డ మోటబిళ్ళ దండెడై పోయినయ్
పనికిరాని పాతాళగరిగయి పోయినయ్
పిల్లల ప్రపంచాన్ని క్రికెట్ బూచి కరిచింది
పాలగోకు మాధుర్యంలో వేపచేదు వొలికింది
బొంబాయి మిఠాయి వంటి టి.వి. తీపికి
బాల్యం దాసోహమైంది

✧ ✧ ✧

ఆటలు లేని బాల్యాన్ని వూహించటం కష్టం
బాల్య సంబంధం లేని ఆటల్ని బతికించటం మరీ కష్టం
చిర్రగోనె ఆటతో వీధులకు ప్రాణం పోసే బాల్యం
దుర్భిణీ వేసినా కనబడదు
చెమ్మచెక్కా చేరడేసి మొగ్గలతో
గంతులేసే చిట్టితల్లుల్ని చూడగలమా
కోతికొమ్మచ్చితో కొమ్మల్లో
కిలకిలలాడాల్సిన బాల్యం పక్షులు
ఎక్కడ ఎగిరిపోయినట్టు-
ఇంటి ముంగటి వాకిళ్ళలో వికసించే
రంగు రంగుల లక్కకోలల సంగీత సవ్వడులేవీ
పుంజీతం ఎత్తుగడల్లో ఆరితేరి పునీతమైన బాల్యం
మచ్చుకైనా కానరాకపోవటం
శిథిల సంస్కృతికి నిదర్శనం

వూరు పిల్లల్లారా
చిన్నితెర ప్రసారాగ్ని సమిధల్లారా
మీరిక వూరు ఆటల్నీ వూరు పాటల్నీ



లైబ్రరీ గాదెల్లోనో ఇంట్లో పాతుకుపోయిన టి.వి. పెట్టెల్లోనో
సినిమారీళ్ళ చుట్టల్లోనో చూడాల్సిందే
తప్పదు గాక తప్పదు
పూరుకు గాలి సోకింది

*10 అక్టోబర్ 1999* *ఆలిండియా రేడియో, హైదరాబాదు*
*21 ఏప్రిల్ 2000*





# అంచనాశిల్పం

మనిషిని అంచనా వేయటమంటే
ఎప్పుడూ అంత సులభం కాదు
అదొక నిరంతర ప్రక్రియ
లోలోతుల్లో అధ్యయనం చేస్తూ
అట్టడుగును తడుముతూ అన్వేషిస్తూ-
విశ్లేషించాలి వివేచించాలి

అంతస్సారం ఆయువుపట్టును
ఒడుపుగా పట్టుకోవాలి
నీటితలం మీద
గుర్రపుడెక్క హరిత మైదానం గుర్తుకు రావాలి
సర్కస్ తీగపై అలవోకగా నడిచే
ఏకాగ్రతా ప్రవాహం గుర్తుకు రావాలి
అప్పుడది
అవగాహనాచిత్రానికి తుదిరూపం

ఏ సందర్భమూ ఏ సమయమూ అంత సులభం కాదిప్పుడు
కలిసి మాట్లాడుకోవటాలు
కలెగలుపుగా మెదలటాలు



నమ్మబల్కటాలు
పొరపొచ్చాల్లేని దీర్ఘకాలిక స్నేహాలు
రెల్లుగడ్డి గుబురుపొదలు ఆవరించిన బాయి సంబంధాలు
ఎటూ నిలబడలేని
అపరిపక్వ మానసిక సంచారాలు ఎదుగుతున్న దశ
ఏండ్ల అనుభవ నైపుణ్యాల్నీ నిర్మాణం పునాదుల్నీ
పెకిలించే ప్రయత్నాలు ముమ్మరమవుతున్న కాలం
విస్తరిస్తున్న పండ్లచెట్టు మీద
ఏ శాఖలోనో ఏ కొమ్మలోనో ఆనవాలు పట్టనిచోట
కంటి కానని తెగులు
అగ్నిపరీక్షో ఆత్మపునీతమో
దిద్దుకోవాలి సమీక్షించాలి జల్లెడ పట్టాలి
పురోగమన దిశలో
పునరాలోచన పునశ్శోధన పునశ్చరణ
బహురూపాల ఎత్తుగడలకు కళ్ళెం వేసే
వ్యూహం ఒడ్డు మీద నిలబడి
పంటచేనులో చేనుగా పచ్చగా భ్రమ గొలిపే
నవనవలాడే కలుపును గుర్తించాలి
వంచనను ధ్వంసం చేసే
అంచనాశిల్పాన్ని పెంపొందించాలి

*జనవరి 30 2000* *ప్రజాసాహితి, అక్టోబర్ 2000*





# కర్తవ్యం

నిర్మాణం కష్టంగా తోచటం
ప్రాథమిక దశ
ఒక తోటను నిర్మించటానికి
ఎంత పాటుపడాలి
సహనమూ గుండె నిబ్బరమూ
సంయమనం వెలుగులో
చీకటిదారిని ఛేదించాలి
ముండ్ల వనాల్ని పండ్ల వనం చేయాలి
ఆచరణలో సానదేలిన వాడెప్పుడూ
అజేయుడే

*15 ఫిబ్రవరి 2000* *ఆలిండియా రేడియో, హైదరాబాద్ 21 ఏప్రిల్ 2000*



# మిణుగురులు (హైకూలు)

ఆకాశంలో
పిడి తెగిన కొడవలి
నెలవంక

✧ ✧ ✧

పొలం పెనంపై
ఎగురుతున్న పజ్జొన్న పేలాలు
కొంగలు

✧ ✧ ✧

తుపాకి దెబ్బ
గాలి తుళ్ళింది
చెట్టు తలలోంచి చిమ్మిన పక్షులు

✧ ✧ ✧

గంట మోగింది
బడికట్ట తెగింది
వరదలు వరదలుగా పిల్ల కాలువలు

✧ ✧ ✧





పక్షుల స్వరచాలనం
అంట్లగిన్నెల అలికిడి
నిద్ర లేస్తున్న సూర్యుడు

✧ ✧ ✧

రాత్రి తటాకం
కీచు'రాయి' విసిరింది
అలలే అలలు

✧ ✧ ✧

లే ఎండ
సిల్కుదారాల్లా
తళుక్కుమనే వానతీగలు

ఆంధ్రభూమి దినపత్రిక
నవంబర్ 2000



# కలవరింత

ఇప్పుడు ఊరు
ఊరు తీరుగ లేదు
సొంతం పరాయిదయింది
విస్తరిస్తున్న వస్తు ప్రపంచం
మాయలో పడి ఆగమాగమయింది
పల్లె వాసనలు ఇగిరిపోయి
పట్నం పొకడలు పోయింది
ఇప్పుడు వూరు
ఊరు లెక్క లేదు
సిమెంటు అరణ్యమై డిష్ యాంటెన్నాల ధగధగలతో
ముస్తాబయింది
పెండ్లిళ్ళలో పేరంటాళ్ళలో
పచ్చని పందిళ్ళ మామిడాకు తోరణాల్ని
సవాలు చేసే షామియానా అయింది
మాదిగడప్పు బతుకు సంసారంలో
చిచ్చుపెట్టే బ్యాండ్ మేళమయింది
వాడవాడలో తొండ ముదిరిన
రాజకీయం ఊసరవెల్లి అయింది





ఇప్పుడు ఊరు
ఊరు తీరుగ లేదు సొంతం పరాయిదయింది
కుండల కొద్ది పాలిచ్చే గేదెలున్న రైతు యింట్లో కూడా
చల్లాపెరుగు వెన్నా నిషిద్ధం
డబ్బు మాలోకం డబ్బాల్లో పాలు పరారై
పట్నంలో తేలాలి కదా
చల్లటి పానీయాలు పల్లెల్లోకి పాకినాయి
పశు సంపద నిలయాలైన ఊళ్ళు ఇప్పుడు కబేళాల అంగళ్ళు
అప్పుల నిప్పుల కుంపట్లలో
బాధలను పాడే చిమ్మట్లు
వాదవివాదాల రచ్చబండలు
కల్తీకల్లు దుకాణాల సీసల ముచ్చట్ల లోగిళ్ళు
వీధి నాటకాల్తో - ఒగ్గు కథల్తో
బతుకుబండిని లాగే కళాకారుల జీవితాలు
రంగుల లోకం దెబ్బతో మసిబారిపోయాయి
ఐరేని కుండ సంక్రాంతి గురిగి
చావుకుండ కంచుడు మినహాయిస్తే
కుమ్మరి బతుకులు వాములో తగలబడ్డాయి
మగ్గాలు మూలవడ్డాయి
బొంబాయికో భీవండికో మస్కట్‌కో మరెక్కడికో
బతుకుపక్షి వలస వలలోకి-
పునరావాస రంగాల రంగంపైకి
ఇప్పుడు వూరు
వూరు లెక్క లేదు పరాయిదయింది
పురుగు తగిలిన చేనయింది
రసంలేని చెరుకు పిప్పయింది
పోలీస్ ఠాణా అయింది
బెదురుచూపుల లేగదూడయింది



పల్లె కల చెదురుతోంది
పల్లె విలవిల్లాడుతోంది
పీడకలల్లో పల్లె కలవరిస్తోంది

18 మార్చి 2000

ఆంధ్రప్రదేశ్ మాసపత్రిక, జనవరి 2006
సంక్రాంతి కవితల పోటీల్లో బహుమతి పొందిన కవిత





# ముగుతాడు వేసే రోజుకోసం

మనిషితనం లేని డొల్ల మనుషుల సమూహం
హింసే పరమావధిగా ప్రవర్ధమానమవుతుంది
చంపటం చట్టబద్ధత సంతరించుకొని
క్షేమంగా రాజ్యమేలుతుంది
ఎందరో తల్లుల ఆవేదనా ఆర్తి
కట్టలు తెంచుకొన్న దుఃఖం
వ్యర్థంగానే అర్థంపర్థం లేకుండా పోయింది
'నా కొడుకునేం చెయ్యొద్దు కాల్మొక్త'
అని బతిమాలి గీమాలి కాళ్ళకడ్డం పడి
వొక్క తీరుగ మొత్తుకున్నా కనికరం లేనోళ్ళు
నల్గురు చూస్తుండగానే-
గద్ద కోడిపిల్లను తన్నుకపోయినట్టు-
మనం మనుషుల లోకంలోనే ఉన్నామా
తేరుకునేలోపే దారుణం జరిగిపోతుంది
హింసలీలావినోదమై ఊరేగుతుంది
యుద్ధం ఆగుతుందని త్యాగం వృధా పోతుందనీ
భావించటం భ్రమ
భూమితల్లి వీరులకు ఊపిరిపోసి



కొత్త లోకాన్ని కలగంటుంది
రాజ్యంగిత్త దౌష్ట్యానికి ముగుతాడు వేసే రోజుకోసం
ఎదురుచూపులో నిమగ్నమవుతుంది

*21 మే 2000*

*ఉత్తరాంధ్ర మాసపత్రిక*
*ఆగస్టు/సెప్టెంబర్ 2000*





# హైటెక్ హంగామా

ఎప్పుడూ ఏదో ఒక ప్రయోగం
ఆలోచనకు అడ్డుకట్ట వేసే
సరికొత్త జనాకర్షక పథకం
కుక్కకు పనుండదు కూసుండ తీరదన్నట్టు
అట్నుంచిటు ఇట్నుంచటు
గాలిగద్ద సుడిగాలి చెక్కర్లు
గుడిసె గుడిసెకు దీపం హోదా
తినటానికి తిండిగింజలక్కర లేదు
గ్యాసు చాలు తెగ ఉబ్బిపోతాం
తలపండిన అనుభవానికి కొత్తగా తర్ఫీదు
కుప్పిగంతుల అక్షరజ్ఞానం
పలకలూ బలపాలు పుస్తకాలూ సామగ్రి సిద్ధం
అధికారులకు పురుటినొప్పులు
టెన్షన్ టెన్షన్ టెన్షన్
అంతా అటెన్షన్
చవితి చంద్రుడొస్తున్నాడు
బహుపరాక్ బహుపరాక్
రక్షణ కరువైన రాజు గాలిలోంచి ఊడిపడతాడు



హడావిడి హంగామా భయం ఆశ్చర్యం బి.పి. టెన్షన్
ఎవరి ముఖం వాస్తుందో ఊహించలేం
ఎవరి ఉద్యోగం ఊడుతుందో చెప్పలేం
ప్రశ్నల వర్షం సొమ్మసిల్లిన ఉద్యోగి!
వాన వెలిసింది ఒక రంగం ముగిసింది
పేపర్లో పెద్దక్షరాలు రంగు రంగుల ఫోటోలు
బాధితుల పాలిటి భయం తాలూకు స్ఫోటకపు మచ్చలు

✧ ✧ ✧

ఎప్పుడూ ఏదో ఒక ప్రయోగం
ఆలోచనకు అడ్డుకట్ట వేసే వ్యూహం
జనంలో కలకలం ఆందోళనా రాగం
కరంటు ధర పెరిగింది
ఓడెక్కేదాకా ఓడ మల్లయ్య
ఓడ దిగినాక బోడి మల్లయ్య
కాకిలెక్కల నీతుల్లో ఇంటర్నేషనల్ ఫేమస్
వెబ్‌సైట్ డాట్‌కామ్ కంప్యూటర్ మైండ్
బిల్‌గేట్స్ కరచాలనం చాలు
స్వర్ణాంధ్ర రావటానికి

భాగ్యనగరం వీధుల్లో నినాదాల నిరసనవరదలు
బషీర్‌బాగ్ సాక్షిగా జన దిగ్బంధం
అదుపులేని ఆగ్రహం
ఎగిసిన నిరసన రాళ్ళ వర్షం
పగిలిన తలలు ఉక్కుపాదం ఉరిమింది
పిడుగులు కురిసింది

అంతా రక్తసిక్తం జనం కకావికలం
సచివాలయంలో నెత్తుటికూడు





సచివుడి చొక్కాపై నెత్తుటి మరక
దేనికి సూచకం
నమ్మి నానవొస్తే పుచ్చి బుర్రలైనందుకు
నమ్మిన నా రాజు నట్టేట ముంచినందుకు
ఊరూరా కొత్త కుంపటి మొదలైంది
కాల్చుతుందో కూల్చుతుందో కాలుతుందో కూలుతుందో
ఎవరికెరుక

*28 సెప్టెంబర్ 2000* *ప్రజాసాహితి, ఫిబ్రవరి 2001*



# బతుకు చక్రం

కాలం మార్కెట్ రాజ్యం
కూడబలుక్కొని-
మట్టిని బువ్వ చేసే మనిషి జీవితంతో
జూదమాడినప్పుడు-
పరస్పరం సంబంధమున్న వృత్తులన్నీ దిగాలు పడిపోతాయి
నిరాశా నిర్లిప్తతా నిట్టూర్పు నిస్పృహ
సుడులు సుడులుగా ఆవరించి
మొండిబతుకును పరిహాసమాడుతాయి
ఓటమిని జయించాలనే బతుకు వేట
కన్నవాళ్ళనీ వున్న ఊరునీ రక్తసంబంధాన్నీ
సవాలు చేసి పుటుక్కున తెంపుతుంది
భూములూ పుస్తెలూ
పాడిపశువులు గొర్లు మాత్రమే కాదు
చరస్థిరాస్తులు సమస్తం తాకట్టు
డాలర్ల పంటలు పండే దేశాలు యాదికొస్తాయి
దళారుల ఇష్టారాజ్యంలో దగాపడి దగాపడి
స్థావరం చేరాక-
కష్టాలు తీగలై కాళ్ళకు చుట్టుకుంటాయి





ఎక్కడైతేనేం అదే తరువాయి
అదే దోపిడి అవతారాలు వేరు
ఏదైతేనేం- బతుకుతెరువు కోసం జెర్రిపోతులాట

ఎడారి భూముల్లో గొర్లు కాయటమో
పాయఖానాలు ఎత్తి పొయ్యటమో
పైస కోసం ఏ పనైనా ఎదురుచెప్పక చేయాల్సిందే

భాషరాని ఒంటరితనం రోజుకింత చంపుక తిన్నా-
పుట్టిన జ్ఞాపకాలు మెదడు తంత్రుల్ని మెలిపెట్టినా
నిబ్బరంగా చస్తూ బతకాలి
మనిషికీ మనిషికీ మధ్య
వస్తు సంబంధమే రాజ్యమేలుతుంది
రెపరెపలాడే ఆస్మాన్ కాగితాలే విలువల్ని నిర్దేశిస్తాయి
భూతల స్వర్గాన్ని చూడవచ్చునేమో
ప్రాణప్రదమైన వూరును చూడలేం కదా
వూరు జీవితంలోని ప్రేమను పొందలేం కదా
కాలుష్యం లేని మాటను వినలేం కదా
క్యాసెట్లో భార్యాబిడ్డలు
కన్పించినా మాట్లాడినా స్పర్శించలేం కదా
ఆత్మీయంగా అలుముకుందామంటే అందనే అందరు
ముఖాన్ని చేతుల్లోకి తీసుకొని
ఆప్యాయంగా మెటికలు మోగిద్దామంటే
దొరకనే దొరుకరు

ఊరు కండ్లల్ల మెదలుతంది
పంటచేను పలకరిస్తంది
పాడిపశువుల పిలుపులు
నాగళ్ళ నడకల చప్పుడు
ఎడ్లవాసన-



కోసిన పచ్చిగడ్డి మొదళ్ళ పరిమళాలు
కారం మెతుకులు తింటేనేం
కలోగంజో తాగితేనేం
ఉన్న వూరు కన్నతల్లి వొడి
రారమ్మని పిలుస్తుంటాయి
పేగుబంధమంటే ఇదేనేమో

*1 అక్టోబర్ 2000* *ఆలిండియా రేడియో, హైదరాబాద్, 28 ఫిబ్రవరి 2001*
*నేటి నిజం ఉగాది సంచిక, 2001*





# కాయలుకాచిన కష్టంగుర్తులు

ఎప్పుడు మేల్కొంటారో ఏమో
పాడిపశువు నిద్ర లేచే వేళకి ముందుగానే
కూరగాయ గంపల్ని చుట్టబట్ట మీద కూర్చుండవెట్టి
బస్తీకి బైలెల్లడమే
చీకటిగానీ ఎన్నీలగానీ వాళ్ళ మాటలకు భయపడాల్సిందే
మొరటుమాటలు మొరటు నడకలే కావొచ్చు
కత్తి పదును వంటి నిజాయితీ
నిప్పులు గక్కే సూటితనం
అప్పుడే కోపం అప్పుడే జాలి
అప్పుడే మెచ్చుకోలు అప్పుడే గొడగొడ దుఃఖం
జీవిత సందర్భంలోని అనేకానేక సన్నివేశాల సమాహారం వాళ్ళు
అంగట్లో జోరబొంత పరిచి
దొగ్గాళ్ళ మీద కూసుండీ
గంపల కూరల్ని పాసంగం లేని తక్కళ్ళతో తూచటమే కాదు
తెలివిమీరిన సుకాశి పానాల లౌక్యం మాటల్ని
చాకచక్యంగా ఎదుర్కొంటూనే- తిప్పికొట్టటమే కాదు
అమ్మకంలో అమ్మతనం వారి సొంతం
దండె కొట్టడానికి వీరిదేం



మారుబ్యారం కాదుకదా
కష్టించి కష్టించి కాయలు కాచిన చేతులవి
ప్రపంచానికి అన్నం పెట్టే ఆత్మీయ అమృతహస్తాలవి
అంబటియాళ్ళ కాగానే అగమాగమవటమే
పొలం పనికి పొద్దుపోవటం గిట్టదు
కాలం విలువ తెలిసినవాళ్ళు కదా
అగ్గువో సగ్గువో ఓ రూపాయి అటో యిటో
కూరగాయల్ని కుమ్మరించి
దోపుకున్న చెక్కుడుసంచిని కాంటాతో బంధించి
బోసిగంపల్తో పల్లెకు తిరుగుముఖం పట్టటమే
పనిషోకే గానీ బట్టషోకు పెయ్యిషోకు లేనివాళ్ళు
నాట్లేసినా కలుపు తీసినా
వరి కోసినా కల్లంలో మెదిలినా
అలుపూ సొలుపు లేని ఉత్పత్తి జీవనమే కానీ-
ఉత్తగ ఉండటం తెలియనివాళ్ళు

మన పొయ్యి లెక్కడానికి
మన ఆకలి తీరడానికి
వాళ్ళెంత కోల్పోతున్నారో
వాళ్ళెంత తోడ్పడుతున్నారో
నిట్టాడులాగా నిలవడుతున్నారో
మననం చేసుకోవటమే కాదు
మన బాధ్యతల్లో వాళ్ళ ఆదర్శం
మన మాటల్లో వారి సూటితనం
మన ఆచరణలో వారి పనితనం
అంతర్లీనమవటానికీ- ఫలవంతమై వెలగటానికీ
కొసరంత త్యాగానికి సిద్ధమవుదాం

3 అక్టోబర్ 2000

*నేటినిజం రిపబ్లిక్ దినోత్సవ సంచిక, 2001*
*ప్రకృతి సాహితీ ప్రచురణ*





# సలపరం పెట్టే జ్ఞాపకం

నువ్వు పొలం దున్ని
విడిచిన నాగలి ఆరనే లేదు
నువ్వు పొలమంతా కలెదిరిగి
అలికిన మొలక బోర్లా పడనే లేదు
బీటలు వారిన పొలాలను
నెర్రెలు వారిన పాదాలస్పర్శతో పునీతం చేసినవాడా
నవ్వులు పూసే నీ ముఖం
ప్రతిబింబమై కదులుతాంది
మెరుపై వస్తావో పవనమై పలకరిస్తావో
వానై కురుస్తావో ఆలింగనమై అల్లుకుంటావో
గరుకు గరుకు సుకుమార హస్తాల
కరచాలనమై పరిమళిస్తావో
ఇంటి ముంగటి వసారాలో కట్టుకున్న
వరికంకుల కట్టపై వాలే పిట్టవై కన్పిస్తావో
నీకై ఎదిరిచూసే నీ వాళ్ళ గుండెల్లో
గూడు కట్టుకున్నవాడా
ఎవరికీ అందనంత ఎత్తు మీద నిలబడి
ఎందుకింత శిక్ష వేయటం



మేమెప్పుడూ నీ వాళ్ళమే
నీ కష్టం బతుకును ప్రేమించినవాళ్ళమే
బంధాలను తెంచే పరాయీకరణ వశీకరణలో
చేతులు కాల్చుకుని
నీకు నువ్వు తెలియకుండానే తప్పిపోయినందుకు-
మేం జీవితకాలం
విషాదాన్ని మింగుతూ బతుకుతున్నాం

కష్టాన్ని జయించినవాడా
పదిమందిలో ప్రతిష్ఠను పెంచుకున్నవాడా
మరణాన్ని జయించనందుకు బాధగా ఉంది
పుట్లకు పుట్లు పంటలు పండించి
గరిసెలు నింపిన చేతులు
ఇట్లా అలసిపోతాయనుకోలేదు
నువ్వు రోజూ ఇంటికాడికి బాయికాడికి
తిరిగే కాలిబాట ఖాళీతనం
వేపపుల్ల నములుతూ గడ్డిమోపుతో
ఉదయమే ఇంటికి వచ్చే నీ నిలువెత్తు రూపం
అచానక్‌గా మమ్మల్ని ఒంటరిచేసి
సలపరం పెట్టే జ్ఞాపకంగా మిగలటం
కలలో సైతం వూహించలేం
తల్చుకోవటం పొల్చుకోవటం
మథనపడటం తండ్లాడటం తప్పిస్తే-
నీకై ఏమివ్వగలం
బంతిపువ్వు నవ్వుల మహీ!
ఏమివ్వగలం



*28 డిసెంబర్ 2000*

*ఆలిండియా రేడియో, హైదరాబాద్*
*28 ఫిబ్రవరి 2001*



# జాతర

మాఘమాసంలో వచ్చే
కూడవెల్లి జాతర పిల్లల స్వప్నలోకం
తిండి మీద ధ్యాస వుండని సంబరాల అంబరం
కలల బండి మీద సవారీ తీసే మహోన్నత జ్ఞాపకం

రంగు కళ్ళద్దాలతో
లాయిలప్ప సాగులాటలో
పిల్లనగొయ్య రాగాల తూగులో
మిఠాయి తీపిలో ఆనందించటమే
పేలాలూ పుట్నాలూ
కుంకుమ మొలదారాలు తినుబండారాలూ
ఎవరి వ్యాపారం వారిది
ఎవరి బతుకు వారిది
జాతర- భిన్న సంస్కృతుల పరిమళం
పొట్టకూటికి కోటి విద్యల ప్రదర్శనం
నాలుగురాళ్ళు సంపాయించటానికి
నానా యాతనల రంగస్థలం
లాటరీల మాయాజాలంలో



నోరు తెరిచిన అదృష్టం
చిన్న ఇనుప రింగులోంచి
రబ్బరులా సాగే సర్కస్ జీవితం
చెక్క గోదా చుట్టూ ఒకవైపు సైకిల్
మరోవైపు సైకిల్ మోటార్ అభిముఖంగా
గగుర్పాటు విన్యాసాలు
బోనులో బక్కచిక్కిన పులిగాండ్రింపుల ఆకలి కేకలు
బతుకును కవ్విస్తూ చావుతో చెలగాటం
పాములవాడి గారడి కనుకట్టులో
కొత్త రూపాయి నోట్ల కట్టలు
జీవితాన్ని పరిహసించే ఉత్తుత్తి కాగితాలు
రంగు వెలిసిన దేవునోళ్ళ రాత్రి బాగోతాలు
రంగురాట్నాల గిరగిరల కేరింతలు
పూసలదండల అందాలు యక్షగానాలు తత్వగీతాలు
సినిమా పాటల అల్లరి డాన్సులు
కడుపు నింపుకోవటానికి సవాలక్ష పాట్లు
స్టేషన్ కలువని రేడియోలా
జాతర్లో జనాల లొల్లి
తాగి తూలుతూ ఒకడు
జేబులు కొడుతూ మరొకడు
తాకుతూ ఒకడు- తిట్లు తింటూ మరొకడు
ఎవడి సరదా వాడిది
చుట్టాల బంధువుల స్నేహితుల
అప్పుల చౌరస్తా- జాతర
మక్కరొట్టె పచ్చిమిరం వెన్నా
సద్ది అన్నం వాగు భోజనం
చెట్లనీడలో సేద దీరుతున్న
మెడపట్టెడల బండెడ్ల నెమరువేతల దృశ్యం





రంగురంగుల కొత్తబట్టల గంగిరెద్దుల కోలాహలం
ఎలా మరువగలం
పూరూర్ల అనుబంధాల కూడలి కూడవెల్లి
మొక్కుబడులు తీరాక
జాతర తిరిగాక
ఎడ్లబండ్లు సమాయత్తమవుతాయి
మూగల చప్పుడుతో మార్మోగే బండ్లబాట
ఊరుకు దారి చూపుతుంది
పనీపాటనీ యాదికి తెస్తుంది

*24 జనవరి 2001* *నేటి నిజం స్వాతంత్ర్య దినోత్సవ సంచిక, 2001*



# పగిలిన కల

అభిరుచికీ
శ్రద్ధకీ పొంతనలేని
కార్పొరేట్ వలలో బిగుసుకుపోతున్న పావురాల క్షోభ ఇది
ఇష్టానికీ ఆసక్తికీ
లంకె కుదరని మానసిక స్థితిలో
బలవంతపు రుద్దుడుకీ బలవుతున్న
అమాయకజీవుల ఆర్తి ఇది
గంపెడాశల మధ్యతరగతి తల్లిదండ్రుల డాలర్ కలల
భ్రమాలోకపు బాటలో దారితప్పిన
గొర్రెపిల్లల దారెటువైపు
స్వర్ణకారుని బులేరు కుంపటి మధ్య కొబ్బరిటెంక నిప్పులో
నిలువెల్లా కాలిపోయే బంగారాన్ని కరిగించే పాత్ర బాధలా-
మార్కెట్ పరచిన రెడ్‌కార్పెట్‌లో
బోల్తాపడి బోల్తాపడి చేతులు కాల్చుకున్న
పత్తిరైతు ఆత్మఘోషలా-
బెదిరిపోయి- బేజారైపోయి చెదిరిపోయిన
పసిమనసుల మాటెపుడైనా ఆలకించామా





'నా కిడ్నీలు అమ్మి తమ్ముణ్ని చదివించండి'
నా చదువుల ఖర్చుతో చెల్లెను బతికించుకోండి

✧ ✧ ✧

మన రంగురంగుల కలలను బహిష్కరించి
అనంతతీరాలను ప్రేమిస్తున్న వాళ్ళు
మనకు కాని మన ప్రతిబింబాలుగా
మన నుంచి దూరంగా హాయిగా ప్రశాంతంగా...
కేరింతలు కొడుతూ పిట్టగూళ్ళను కడుతూ
వొంటపట్టని పాఠాల్ని బహిష్కరించి
చక్కని గుణపాఠాలే నేర్పారు
తల్లులారా తండ్రులారా
ఇకనైనా ఇకనైనా కండ్లు తెరవండి

*2 ఆగస్టు 2001* — *అధ్యాపక జ్వాల, 2001 ఏప్రిల్*



# వీరులు మరణించరు

ఎక్కడ న్యాయానికి సమాధి కట్టి
అన్యాయం ఊరేగుతుందో
ఎక్కడ ప్రజాస్వామ్యం ముసుగు
గొంతు చించుకొని చాపకింది నీరౌతుందో-
జిత్తులమారి రూపంలో మర్యాద నటిస్తుందో
ఎక్కడ హక్కుల కపోతం గాయపడి నెత్తురోడుతుందో
విలవిలలాడుతుందో-
అక్కడ ఓ మానవత్వం మంచుకిరణమై ఉదయిస్తుంది
ఎండిన నేలకు చిరుజల్లు ఉపశమనమై ఓదార్చుతుంది
హక్కులపాదును ఎలా రక్షించుకోవాలో నేర్పుతుంది
ప్రతిఘటనా ఆలోచనకు పక్వస్థితిని కల్పిస్తుంది

ఆ ఉదయానికీ
ఆ ఓదార్పుకీ
ఆ నేర్పరితనానికీ
ఆ ప్రతిఘటనా బలానికీ ఏం పేరుపెడదాం



హక్కుల ఉద్యమ రహదారి ప్రేమికుల్ని
రక్తసిక్తం చేస్తున్న రాజ్యమా! యంత్రాంగమా



ఆకాశంపై ఉమ్మివేయటం
ఎదురు గాలి కడ్డు నిల్చి విసర్జించటం
ఎత్తుగడ ఎన్నటికీ కాదు
దరిలేని అంచు మీద నిలబడి విన్యాసం చేయటమే

కళలెప్పుడు ప్రజల కోసమే
ఈ బైరూపుల కళ ఎవరికోసం
ప్రాణాలు తోడడానికి ఎన్నెన్ని వ్యూహాలు
శకుని పాచికల కుతంత్రపు పథకాలు
జనారణ్యంలో భయానక బీభత్స వాతావరణంలో
రాళ్ళవానలో నిర్బంధాల తొక్కిసలాటలో
పట్టు సడలని నిబ్బరంతో
విరామమెరుగని వీరుల చిరునవ్వు ముందు
నీ సకల కళాశాస్త్రాలు శూన్యం
నీ అస్త్రశస్త్రాల నైపుణ్యం శూన్యం
సూత్రధారులూ తెల్సు
పాత్రధారులూ తెల్సు
నాటకాలకు తెర తొలగాల్సిన కాలం
ఎంత దూరంలోనో లేదు
కాలగమనంలో హక్కుల్ని బతికించే
వీరులు పుడుతూనే ఉంటారు
భూమిలో కలెగల్సి పోయి
అనుకూల సమయంలో అంకురించే
వివిధ రకాల విత్తనాల మొక్కల్లా
దూసుకొస్తారు నమనమలాడుతూ-
ఆకుపచ్చ దరహాసాల్ని చిలకరిస్తూ
వీరులకు పుటకే కానీ చావెక్కడిదీ

*25 డిసెంబర్ 2002*

*అధ్యాపక జ్వాల, ఫిబ్రవరి 2002*



# మార్కెట్‌మాయ

తనలో లేని మనిషి కోసం
తల్లడిల్లి ఏం ప్రయోజనం
తనకోసం తన వాళ్ళకోసం
ఇంకా ఇంకా కావాలనుకునే తనం
ఇంటర్‌నెట్ స్థాయిలో వేగవంతం
డబ్బు హోదా దర్జా ఫ్యాషన్ ముందు
మనిషితనం దిగదుడుపు
అభద్రంగా వీస్తున్న చప్పుడు వంటి జీవితం
అమాంతంగా అన్ని సౌకర్యాలు
ముంగిట్లో వాలిపోవాలనే తహతహ
బంగారుగుడ్ల డాలర్ బాతుల్ని
పెంచి పోషించే చదువుల స్వర్గం తృష్ణ

ఆత్మ అనుబంధం
ప్రేమ సంబంధం
అంతా వొట్టి భ్రమ

పోటీ ప్రపంచంలో బతుకొక వస్తువు
మనిషి వొక కఠిన శిల





ఏడ్చినా నవ్వినా నడిచినా నిల్చినా
మాట్లాడినా మౌనం విరబూసినా
ప్రతి కదలికలో ప్రతి విన్యాసంలో
ఒక స్టయిల్ దురాక్రమణ

ఏమనుకున్నా సరే
నిర్దయగా నిర్భీతిగా ప్రవాహం వూపుతో మాట్లాడటం
అంతే దురుసుగా తడిరహితంగా ప్రవర్తించటం
విలువల విధ్వంసం వూబిలో కూరుకపోవటమే
ప్రపంచీకరణ మాయలో పడిపోవటమే
పతన సంస్కృతి ప్రమాదాన్ని పసిగట్టకపోతే
రేపు మనకు మిగిలేది
ఎడారి మనసుల సముదాయమే

*30 సెప్టెంబర్ 2001* *నేటినిజం దీపావళి సంచిక, 2001*



# అవ్, మాది మాకు కావాలె

ఏండ్ల నుంచి
ఎంత మొత్తుకుంటె యేం ఫాయిదా
ఎల్లన్న గొంగడి యేసిన జాగలనే ఉన్నట్టు
మన బాధలు యెక్కడి యక్కడనే
యాడుండాల్నో గాన్నే వుండవట్టె
మాది మాకు గావాలని యెప్పటి సందో-
ఎగిళ్ళు వారక ముందే మర్రిచెట్టు మీద
గుంపు కాకులు వొర్రినట్టు
వొక్క తీర్గ రికాం లేకుంట వొర్రనే వత్తిమి
గుళ్ళె దేవునికన్న కనికరమొత్తది గని
గాళ్ళు మాత్రం చెవులున్న చెవిటోళ్ళ తీర్గ
కండ్లున్న గుడ్డోళ్ళ తీర్గ చెయ్యవట్రి
ఓస్నీ అన్యాలం పాడుగాను
మీదేమన్న పంచుకుంటిమా గుంజుకుంటిమా
వున్న నీళ్ళన్నీ మీదిక్కే మల్పుకుంటిరి
యీడ బుట్టిన కరంటు- యీడ బుట్టిన బొగ్గు
అటెత్కపోతిరి





పట్నంకెళ్ళి మొదలువెడితే ఇందూరు దాకా
లస్కర్ కెళ్ళి మొదలువెడ్తె కన్నగురం దాకా
బంగారం పండే ర్యాగల్లు అగ్గువకే అల్కుకుంటిరి
కార్ఖానాలు మీయె- కాలేజీలు మీయె
సిన్మాల పేరు జెప్పి ఎకరాల కెకరాలు దొబ్బితిరి
పత్రికలు మియ్యె పలుకుబడి మీదె
మా జాగలు దోచి మమ్ముల్నె జీతం బెట్టుకుంటిరి
ఎడ్డేషం మాదాయె ఎట్టిశాకిరి మాదాయె
బగ్గడేషం మాదాయె బాంచన్ బతుకు మాదాయె
కల్లం మీది సావుకారి బతుకు మీదాయె
అల్కబీర్ గోజలోలె పులకాశోలె గోసొలె మేం
మా దగ్గెర చదువు తక్కువ శాని తక్కువ
మా కొలువులన్ని కొల్లగొడ్తిరి
గొర్లమంద మీద తోడేళ్ళు వడ్డట్టు
అమాంతం గుంజుకపోయి ఆంబుక్క వెడ్తిరి
సర్కారు మీదే సవాలక్ష అధికారాలు మీవె
పెద్ద కొడుకులు మీరే- పెద్ద మనుషులు మీరే
మాకేం మిగిలె
ఎన్గులశిప్ప గొంగడి గోచీ రుమాల్ పెల్క
మన జమీనంత కలెదిరిగి యాడజూడు
బొడ్లె వరాల్ పోస్కొని పుట్టినట్టు
ఎటు సూడు వాళ్ళే వాళ్ళదే పెద్దిర్కం
మనోళ్ళకు సుతిగల్వది
తలకాయ లేనట్టు తలొక్కటి మాట్లాడ్తరు

పెయ్యి మీదికొచ్చేదాక పట్టించుకోకపోతిమి
ముడ్డి కిందికి నీళ్ళొచ్చెదాక సోయిలేకుంట వుంటిమి



అయితాయెగని
ఇప్పటికైనా క్యాల్‌తోని మెదులుదాం
ఒక్క మాట మీద నిలబడాలె
లడాయి షురూ జెయ్యాలె
వోట్లకు పుట్టిన నా కొడుకులు
ఏ రోటి కాడ ఆ రోటి పాటవాడ్తరు
పదవిచ్చేసరికి టండా అయిపోతరు
యిసుంటోళ్ళతోని జాగర్త గుండాలె
శాన తెల్విలోని కొట్లాడాలె
మోటుకష్టం జేస్కునే మనోళ్ళకు
సమ్‌జయేటట్టు జెప్పాలె
నంగి నంగి మాటలొద్దు
గోడ మీది వాటాలొద్దు
దొంగదొంగ వేషాలొద్దు
సాటుసాటు బ్యారాలొద్దు
మాట మీద నిలవడాలె
మాటకు పాటు పడాలె
మనం మాట పట్టింపు వున్నోళ్ళం
ఇజ్జత్‌కు పాటువడేటోళ్ళం
మన మనాది పోవాలంటే
మనది మనకు రావాలె
కల్సికట్టుగ పనిజెయ్యాలె
తెలంగాణ సాధించి తీరాలే

*28 నవంబర్ 2001*

*నేటినిజం రిపబ్లిక్ డే సంచిక*
*చుక్కపొద్దు, పొక్కిలి కవితా సంకలనాలు*





# మనలో ఒకడు

అతడొక సాదాసీదా వ్యక్తిత్వానికి చిహ్నం
ఎంతటి నిరాడంబరుడో
అంతటి మంచి మనసు- నిండుకుండ
నల్గురితో పెనవేసుకుపోవటం
నల్గురికి ఆసరాగా ఉండటం
కష్టమొచ్చినా సుఖమొచ్చినా
అండగా నిలవడటం
ప్రతి చిన్న విషయం ప్రతి చిన్న సమాచారం
ప్రతి అలికిడి
తన హక్కుగా బతికినవాడు
రంగులు రభసలు తెలియనివాడు
ముసుగులు లేని ముసిముసి నవ్వుల పల్లె పరిమళం
పండుగ పండుగకు
కుంకుమ బుకా గులాల్ పొట్లాల్ పంచి
ఇంటింటి కూరాళ్ళకు బొట్లైనవాడు
పాత పైజామా మాసిన గడ్డం
బీడి కొరుకుల కమీజు- చెవులో కరుకు బీడి
భుజం మీద పాత శెద్దరి వెరశి గాజుల ఫక్కీర్ సాబ్



ఊరందరికీ నోట్లో పండు
కల్లం దగ్గర వడ్లు పెడితె
కండ్ల నిండా కాంతి వెలుగులు
నాలుగు మేకల్ని వెంబడేసుకొని
పాత రబ్బరి చెప్పులేసుకొని
కమ్మ కత్తితో వేపమండల్ని సీమచింత కొమ్మల్ని-
కోసి పెట్టే మేకల కాపరి
ఊళ్ళోకి ఏ కొత్త వస్తువొచ్చినా దినుసు వొచ్చినా
వీధి వీధినా సందుసందునా ఎలాన్
ఆయన గొంతు ధ్వనే
ఎవరేమిచ్చినా ఎంతిచ్చినా
మారు మాటుండదు తృప్తిగా స్వీకరించటమే
పీరీల పండుగొస్తే చాలు
పిల్లల్లాగా ఆయనకెంత సంతోషమో
పీరీల నెత్తుకొని మాతోపాటు
అస్సోయ్‌ధూలా
అలువా ఆటల్లో కోలాటం పాటల్లో
గొంతు కలిపి గంతు కలిపి
ఆటకు ప్రాణం పోసే సూత్రధారుడు
మట్కీల్ తీసినాంక ప్యాతియాల్ ఇచ్చినాంక
పీరీల మొఖాల్ తిప్పినాంక
ఏబిశిగాన్ని కొట్టేటప్పుడు సూడాలే
ఫక్కీర్ సాబ్ పౌరుషం
ఊదుబెల్లం పంచి కుడుకపేర్లు పీర్లకు కట్టినంక
పండుగ అయినంక రాత్రిపూట పీరీలు చెర్ల వడుతయ్
పడినాంక చెరువుకట్ట వెంట
పీర్లను కీర్తిస్తూ పాటలు
వూర్లోకి మర్లుతూ జనం గుంపు





జీవితంలోని బాధనంత రుంగ చుట్టి తాడూ వదులుతూ
తపన పడుతూ తల్లడిల్లుతూ కన్నీరు పెడుతూ కరిగిపోతూ
పాటలు పలికించే ఫక్కీర్ సాబ్
ఎప్పటికీ వెంటాడే దృశ్యం
ఎన్ని కష్టాలు మోశాడు
ఎంత ధైర్యంతో బతుకును ఈదాడు
ఆయనకు చేయూత నివ్వటం
ఆయనకు ఆసరా అవ్వటం మన బాధ్యత
మనతో బతికిన ప్రతివాడు మనవాడవటమే
మన సంస్కృతి మన విధి

*14 డిసెంబర్ 2001* — *నేటినిజం దినపత్రిక*



# వలపోత

రోహిణీకార్తె ప్రవేశంతోనే
మొగులు మెత్తవడ్తది
కట్టే గరువు ఏరేసిన పెరండ్లు
అద్దాల లెక్క శుభ్రంగా తళుక్కుమంటయి
పానికె లేసుకొని
తల్లేరు కట్టుకొని ఎరువుబండ్లు
శురూ అవుతయి
వడ్లకమ్మరి వాకిళ్ళల్ల రైతుసభ మొదలయితది
పాత నాగండ్లకు పానమొస్తది
మొదటివానతోనే భూమి పులకరిస్తది
పచ్చగడ్డి మొక్కల గుంపు
భూమి బెట్టాలను చీల్చుకొని
తన్నుకొని ముందట వడ్తది
పొలాలన్నీ ఆకుపచ్చ హోళీ ఆడుకున్నట్టు
బక్కబక్క గోజలు సతాయించకుంట
యాడవడితె ఆడనే మేస్తయి
తోకలు ఎగిరేస్తూ చెంగనాల్ కొట్టుకుంట
లేగదూడలు దుంకుడే దుంకుడు





చిర్రగోనె చీకుదిగేసుడు ఆటల్లో
పసుల మలిపే పోరగాళ్ళు
వానంటే ఎంత ప్రాణం
వానంటే ఎంత చైతన్యం
అనంత జీవకోటి బతుకుల్లో ఆశల మిణుగురు వాన
పనితనానికి సానపెట్టే రాపిడికోల వాన

✧ ✧ ✧

వొక్క మక్కజొన్న గుడ్డం మీద
వొక్క నారుమడి మీద
వొక్క చెరుకుతోట మీద ఎంత భరోసా
పిల్లగాళ్ళ ఫీజులు మందుసంచి లాగోడీలు
అలిగే అల్లుడి కోరికలు బిడ్డ బారసాలలు
మందులూ మాకులూ ఎల్లమ్మలు పోశమ్మలు
పూరా సంసారం...
పెద్ద మొత్తంల రైతు బతుకు భూమి పంట
ఇవాళ భూములు భూముల లెక్క ఉన్నయా
కాలం కాలం తీరుగ ఉన్నదా
రైతు రైతు వోతుగ ఉన్నడా
నీళ్ళు లేక పొలాలు పడావు గుడ్డాలు బీడు బీడు
మనసంతా కలికలి
రైతు బతుకుల రాయి వడుతాంది
మిర్గం పాయె ఆర్ద్ర పాయె
నారుమడులు ముదిరిపాయె
మొక్కజొన్న చేన్లు ఎండి గలగలాయె
పసుల గడ్డికి కరువొచ్చె
రొంబొచ్చె గుద్దుకునె కాలమొచ్చె



కరంటు బిల్లులోడు అంజుమాన్ అప్పుల వాడు
దర్వాజా చెక్కలు పీకి ధూమ్‌ధామ్ చెయ్యవట్టె
కాలం సంగతి తెల్సి కూడా
సర్కారుకు చీమ కుట్టకపాయె
నీళ్ళే బతుకును వెలిగిస్తయ్
నీళ్ళే సంసారం నిలవెడుతయ్
చెరువుల నీళ్ళు గలగల నవ్వితే
మా యిండ్లళ్ళ గరిసెలు కళకళలాడుతయ్
రైతుబతుకు బతికినోడికి రైతు కష్టాలు ఎరుక
ఎవ్వరొచ్చినా ఎవ్వరు పోయినా
మట్టిబిడ్డకే పుట్టెడు బాధలు
కష్టమో నిష్ఠూరమో భరించుడు నేర్వాలె
నీలినీలి మబ్బుల్లో
కనుమరుగయిన వాన చినుకుల జాడ కోసం
గూనధారల సప్పుడు కోసం
వూరువూరంతా ఒకటే ఎదురుచూపు
కండ్లల్ల వత్తులేసుకొని
పగుల్తున్న గుండె పెంకుల్ని అదిమిపడుతూ
అడుగుతీసి అడుగు వేస్తూ ఆశల ఎడారిలో పయనం

*18 జూలై 2002* *ప్రజాసాహితి రజతోత్సవ సంచిక*





# జ్ఞాపకాల ముసురు

కాల్చిన సితాలపుకాయలు
ర్యాలాకు కొమ్మల్తో చల్లార్చి
జల్లెట్లో పేర్చి ఇంటి ముంగటి పందిరి మీద
రాత్రిపూట మంచులో తడిసిన
ఆ పరిమళఫలాల రుచి
మరచిపోని వొక తియ్యటి జ్ఞాపకం

✧ ✧ ✧

పొద్దుటిపూట
ఉడుకుడుకు గట్కలో
చింతగింజ వేస్తే మునుగని
చిక్కటి 'సల్ల' కలిపి
రాచిప్పలోని దొడ్డు ఉప్పుగళ్ళను
తల్లెలో రంగరించి-
పొడగాటి పచ్చిమిరపకాయను
రెండుగా నడుమ చీల్చి
యింత ఉప్పు రాసి- యింత నెయ్యి పూసి
పొయ్యిల రగరగ మెరిసే నిప్పుకల మీద



అటూయిటూ బొర్లిచ్చి తీసి-
గట్కు జుర్రుకుంట నడుమనడుమ
కాల్చిన మిరపకాయను కర్రకర్ర నమిలిన
అద్భుతమైన రుచి ఇప్పటికీ యాది

✧ ✧ ✧

అంబటియాళ్ళ సద్ది రాంగనే
పొలంల నాగలి నిలవెట్టి
ఎడ్ల తోక తాళ్ళు విడిచి
ముల్లుకట్టె బురదలో నిలిపి
పొలంల పేరిన నీళ్ళల్ల ఆదరాబాదరా
కాల్జెయిలు కడిగి
ఒడ్డు మీద కాలు సాపి కూసుండీ
కళ్ళారా పచ్చని చెట్లను చూస్తూ
కడుపారా అంబలి జుర్రుతూ
అలసట దీరే రైతు కష్టం
వెంటాడే వొక మెరుపుతీగ

✧ ✧ ✧

పసులగాసే యాళ్ళ పజ్జొన్న కాపీలు
పిసికిళ్ళు- పొట్టుతోనే కాల్చే మక్కజొన్న కంకులు
కనుకులో కాల్చిన పచ్చి శెనగచెట్లు
నోట్లో నీళ్ళూరించే కమ్మటి ముచ్చట్లు
తొట్టినిండా అనపకాయ నింపి
మోతుకుఆకుల మీద లొట్టి బొర్లించి నిలిపి
చుట్టూతా మంటబెట్టి
ఉడికించిన అనుముల రుచి గొప్ప అనుభూతి

✧ ✧ ✧





జాజు బూడిద మసి పెయినింద పూసుకొని
సున్నేరు అద్దిన అట్ట కిరీటాలు వెట్టుకొని
గవ్వల గజ్జెలు కాళ్ళకు కట్టుకొని
రాత్రి చూసిన నాటకాల దర్వులను
వల్లెవేసే పల్లె చేష్టలు
మర్రిచెట్టు కింద భాగోతాలు
వాలిసుగ్రీవుల యుద్ధాలు
సందు చూసుకొని నప్పతిగ తప్పించి
మంది చేన్లో మజా ఉడాయించే
కల్మతోక సారకోడె దొంగ ఏశాలు
మంచె మీది నుంచి విసిరే వడిసెల రాయితీర్గ
రయ్యన ఉరికొచ్చి చెవులకు తాకే
పంటకాపుల మోటుమాటల దెబ్బలు
కొన్ని తియ్యగా కొన్ని పుల్లగా కొన్ని ఘాటుగా
తుంపర తుంపరగా రాలే జ్ఞాపకాల ముసురు

✧ ✧ ✧

ఎన్ని చూసినం ఎన్ని చేసినం ఎక్కడి దాకొచ్చినం
ఇప్పుడెటు జూడు అంతా వెలితి వెలితి
ఎండిపోయిన బీడులు సర్కారు తుమ్మలు
తుప్పలు మొలిసిన బాయిబొందలు
దుమ్ము రేగిన బోరుపొక్కలు
లారీ లెక్కిన పశువులు తర్లిపోయిన ఇసుకలు
బోసివోయిన వాగులు నీళ్ళ కష్టాలు తిండితిప్పలు
పెట్టెబేడా సర్దుకొని బస్టాండులో
బావురుమనే దుఃఖపు సముద్రాలు
తాయిమాయి బతుకులు చెంచరిల్లిన మనసులు
జిట్టరేణీకంప జ్ఞాపకాలు

*13 మే 2003*

*ప్రజాసాహితి రైతు ప్రత్యేక సంచిక, 2005 నవంబర్*



# అగమ్యం

చూసీ చూడనట్టు
నవ్వీ నవ్వనట్టు
పరిచయం ఉండీ ఉండనట్టు
ఎందుకీ నటనా కౌశలం

తపన
ఏదో సాధించాలనే తపన
ఉరుకులు పరుగులు
ఏదో స్వంతం చేసుకోవాలనే ఆబ
పలుకుబడి పైస హోదా మెయిన్‌టెనెన్స్
అర్హతలున్నప్పుడేనా విలువా గౌరవం
మంచితనానికీ మర్యాదకీ
అణకువకీ అమాయకత్వానికీ
నీతికీ నిజాయితీకీ కాలం చెల్లుతున్న కాలం
నవరసనటనా సార్వభౌమత్వంలో
హరిశ్చంద్రులు అపురూపమే
కాని కూడు కోసం యెన్నెన్ని కాని పనులో
వరుస తప్పి గతి తప్పిన లోలకం మనసు





రక్తబంధం బంధుత్వం
ఆత్మీయత అనురాగం ఇవన్నీ ఔట్ డేటెడ్

పయనమెటో
తీరం దొరకని దాహం తీరని అగమ్యంలో
జీవికి తృప్తి లేదు
మనో సంచారంలో అలసట
బహుశా పతన దశ

*21 జనవరి 2004*

*వార్త ఆదివారం అనుబంధం*
*20 ఫిబ్రవరి 2005*



# జలపాత స్పర్శ

ఆదిలాబాద్ అడవితల్లి
తొలిసూరి బిడ్డ
కుంటాలా జలపాతమా
ఏమందము ఏమానందము
మన తలరాతగాడు ఎంతటి సహజశిల్పియో
అంతటి సౌందర్యారాధకుడు
దట్టమైన టేకువనాల మధ్య
నీ ప్రాకృతిక సౌందర్యరూపాన్ని చూసి
నా కళ్ళెంత ఈర్ష్యపడ్డాయో నా ఉత్సాహాన్నడుగు

విశాలమైన నీ ఒడిలో
రకరకాల రంగురంగుల యీ పువ్వుల్ని చూడు
ఆడుతూ గెంతుతూ నీ అందాన్ని ఆరగిస్తూ-
కేరింతలు కొడుతూ, అణువణువు తడుముతూ ఉంటే
నీకెంత అమృతనపు ఆనందమో
బుచ్చిబుచ్చి పాదాల తాకిడి స్పర్శతో
నీకెంత పులకరింతో కదా
జలపాత కొండ అంచుల మీద విహరించే పక్షుల్లా పిల్లలు
జలనృత్యానికి జత కలిపే లేగల సయ్యాటలు





కుంటాలా
నీ సౌందర్యకాంతుల్ని బంధించటానికి
ఎన్ని కెమెరా కన్నులు పోటీపడ్డాయో ప్రేమతో-

ఆకలితో కృశించే వాడికి
ఏకకాలంలో షడ్రసోపేత భోజనాలు అందినట్టు
లేకలేక నువ్వు మాకు దొరికావు
ఎంతని ఆస్వాదించగలం
జడలు దాల్చిన అడవితల్లి కురుల దారుల వెంట
జలజలా గలగలా రాలే ముత్యాల తలంబ్రాల లాగా
జాలువారే నీటి బిందువుల సమూహాలు
గోధుమరంగు యిసుక మధ్య జలపాత జలాశయంలో
బుడుబుంగల్లా ఈదులాడే కేరింతల సందడి
నిజంగా యీ పరిసర ప్రాంతం వొక స్వప్నలోకం

కుంటాలా
నీ పరీవాహక ప్రాంగణంలో
ఎందరు పోరాటయోధులు విశ్రమించారో కదా
రేపటి స్వప్నం కోసం
ఎన్ని కొండమల్లెలు కొండంత ధైర్యంతో
జలవిశ్వాసాన్ని పొందాయో కదా
అందానికి గర్వమెక్కువ అంటారు
గర్వంలేని అందాన్ని ఇక్కడే వీక్షించా
తొణకని కుండలా ఉండే నీ ఔన్నత్యం
అచ్చమైన గోండ్వానా అడవిపువ్వు పరిమళం

*25 జనవరి 2004* *నేటినిజం- దీపావళి ప్రత్యేక సంచిక, 2004*



# చెదరని దృశ్యం

కరువు గీచిన కాలచిత్రంలో దుమ్ము కొట్టుకుపోయిన
బూడిదరంగు శరీరంతో కదిలే కొండలాగా
అడుగులు కదిలిస్తూ మూలమలుపు బోరింగు చెంతకు-
దామా నీళ్ళు తాగాలనీ ఓ లుంగీవాలాను అనుసరిస్తూ
బోరింగు నోటిలో తొండము చేర్చి
నిండిన తొండమును తన నోట్లోకి మల్చుకోవటం
గుమిగూడిన జనానికి ఒక సరదా వింత
దుమ్ము పట్టిన చిన్నచిన్న చేతులు
బోరింగుతో ఏతం వేస్తూ ఆ పర్వతం నోటికి
నీళ్ళందిస్తూ ఆనందిస్తూ-

చిన్నపిల్లల్లాగా దృశ్యాన్ని పరికించే నామోషీ పెద్దలు
ఇరవై నిమిషాల నిర్విరామ బాలభగీరథ ప్రయత్నంలో
కొండ కడుపు నిండిందనటానికి కొండ తిరుగు పయనమే సాక్ష్యం

జీవకళల బతుక్కి చిచ్చు పెట్టిందెవరు
ఎన్నాళ్ళయిందో కడుపునిండా తిండి లేని దైన్యం చూపులు
చేటల్లాంటి చెవుల్ని అదిలిస్తూ
అమాయకంగా అందరిని చూస్తూ-





ముందుకు కదులుతుంటే ఆ నడకలో రాజసం
ఆ చూపులో బాధామయ జీవన గాంభీర్యం
అడవితల్లి ముద్దుబిడ్డకి అనుకోని కష్టాలు
సర్కస్ బతుకుపోరులో తానొక భాగస్వామి

మన కంటికి వినోదాన్ని పంచిన ఆ నల్లటి కొండ
సంచార బతుకు గుడారాలకు అండ ఆలంబన

12 నవంబర్ 2004



# ఎటమటం

పొద్దటిపూట
కట్ట మీద నిలబడి చూపును వెనుకకు మళ్ళిస్తే
పచ్చటి పరుపులా కనిపించే పత్రహరితం
ముందుకు తిరిగితే పరచిన సమతల దర్పణంలా
అలలు లేని చెరువులో విరిసిన తామరల సమూహంలో
తిరుగాడుతున్న నీటిపక్షుల కిలకిలలు
కట్ట మీది నుంచి బట్టలగట్టా వెనక్కి కట్టుకొని
సైకిల్‌పై వూళ్ళోకి వచ్చే పద్మశాలి పద్మయ్య
లేతలేత కిరణాలలో మెరుస్తూ మందకు మంద
ముందుకు సాగే జంగిడిగోజల తాపీ నడక
ఊళ్ళోంచి స్పష్టంగా వినవచ్చే కాయగూరల
అమ్మకందారు గొంతుసవ్వడి
అంతా మట్టివాసన చెట్లవాసన నీటివాసన
అల్లుకుపోయిన అనుబంధాల బీరపాదువూరు
పుట్లకు పుట్లు కాగులు, గుమ్మీలు నింపే రైతు కష్టం ఆనవాలు

✧ ✧ ✧





ఇప్పుడు చెరువు చెదిరిపోయింది
లొట్టపీసుగుబుర్లతో ఇటుకబట్టీల గుంతలతో పొగలతో
నీటిచెమ్మ కనిపించని ఎడారి వాతావరణం
తాతలనాటి మర్రిచెట్లు, చింతలు, వేపలు
నేలకూలుతున్న చప్పుడు
వాగును వేటాడే చిత్రకన్ను
కాంట్రాక్టర్ల రొద
మడుగులు మటుమాయం
బాయిలు బొందలైనయ్
చెరువులో చాకిరేవు బహిరంగం
గట్టున బోరు మొలిచింది
పశువులకు నీటితొట్టెలు
చినుకు రాలక భూమి చితికిపోయింది
ఎవుసం ఎటమటమయింది
కన్నతల్లి వంటి చెరువు ధ్వంసం
కల్పవృక్షం వంటి వూరు ధ్వంసం
పాడిబర్రె వంటి వాగు ధ్వంసం
సంచులకొద్దీ పంటల ధాన్యాగారం
నేడొక కారాగారం
'పనికి ఆహారం' బియ్యంతో
పూటెల్ల దీసుకుంటున్న బతుకు దృశ్యం

*29 డిసెంబర్ 2004*

*ఉపాధ్యాయ, మే 2005*



# పసుల గోస

ఏమి కాలమిది ఏమి గోస యిది
రైతుతో సహా చెమటోడ్చి పొలాలను సస్యాలుగా మార్చి
బతుకును పండించే పసుల సంతతికి
గడ్డుకాలమిది

కడుపు నిండది కుతి తీరది మూతి కందది
ఎక్కడేం దొరుకుతుందోనని కాలు నిలువక
కలె దిరుగుడు అటూయిటూ ఉరుకుడు
తినటానికి బియ్యం దొరుకుతాయేమో
మేత మాత్రం కష్టమే
తిరిగి తిరిగి అలిసిన పశువులు
ఎండిన డొక్కల దిగులు కళ్ళతో

ప్రభువుల పథకం మండలానికో పశుగ్రాస కేంద్రం
వందగ్రామాల వేల పశువుల
ఆకలితీర్చే అమృతమా ప్రసాదమా
ఇదొక సమయానుకూల సంతర్పణం
గడ్డికోసం లైనులో నిలవడి నిలవడి గావరై
బేజారై పడిపోయినా-





నానా గడ్డి కరిచే వాళ్ళ ఉషారు ముందు
బక్కరైతు చాలాకీ నీరుగారిపోతుంది
మనిషి మసిలీ మసిలీ వోపిక సన్నగిల్లి
తలా యింత గడ్డి మోసుకెళ్తే కఠినచర్యలు
ఎప్పుడైనా ఎక్కడైనా విన్నామా
గడ్డికోసం కరువుదాడి
గడ్డికోసం రాస్తారోకో
పశువుల్తో మండలాఫీసుల దిగ్బంధనం
బహుశా యిది తెలంగాణకే సహజమేమో

*17 జూలై 2005*



# అంతర్మథనం

అమ్మలాగే నాన్న కూడా పిల్లలకు ప్రేమపాత్రుడే
కని పెంచిన బంధాన్ని యెలా విస్మరించగలం
బాకి లేకనో బాధ్యతకు దూరమయ్యో
ఆత్మీయహస్తం నేల కొరిగితే
పెరిగే పిల్లల కెంత కష్టం
తోటి పిల్లలకు ధీటుగా చదివించటం పోషించటం
పోటీ ప్రపంచంలో పెనుసవాలు
బాపూ! నువ్వంటే గౌరవమే అనురాగమే
మా యిష్టాలకు భిన్నంగా నువ్వు లేకపోవటమే బాధ
కాలమయితే మా జీవునానికి ధోకా లేదు
వరుస కరువులు కాటేసినప్పుడు
బతుకును దిద్దే వ్యవసాయం తలకిందులైనా
నిబ్బరంతో బరువులు మోశాం
ముందుండి నువ్వు నడపవలసిన నాగలికి
లేత వయసులోనే బాలసారథులమయ్యాం
కష్టం ఘాటుకారమైనా ఫలితం అమోఘమని నమ్మాం



అమ్మ వ్యవసాయజీవి
సాగుబడిని నమ్మిన నిత్య విద్యార్థి



ఆరుపదులు దాటిన వెండితీగెల వయసైనా
అమ్మ మునుమును దాటలేము

బాపూ,
నువ్వు లేని లోటు మాకు అమ్మమ్మ తీర్చింది
ఏండ్లనాటి మాగిన కొయ్యకుండ బట్టపేలికల్లో
దాచుకున్న ద్రవ్యంతో-
మా బతుకుకొక రూపమిచ్చింది
యీమధ్యనే మమ్మల్ని వొదిలి తీరం కాని తీరాలకు-

బాపూ,
మేము నీ ప్రేమకు నోచుకోకున్నా
నీ పెంపకం ఫలాలు అందుకోకున్నా
అమ్మా అమ్మమ్మల శిక్షణలో ఆరితేరాం
కాలం దెబ్బలు ఎరిగిన ధీమాతో ఎప్పటికీ
అజేయంగా పాదుకుంటాం
అమ్మ వంటి మట్టిని నమ్ముకున్న మాకు
నీ వెలితి తెలియకపోవటం సాహసమే కదూ

*15 నవంబర్ 2005* *నాయిన కవితా సంకలనం, ఓరుగల్లు*



# ఊబి

మట్టిరోడ్డు మీద
దుమ్ము రేపుతూ
టాటా ఇండికాలో తెల్లకొంగలు
భూమి మీద కాలు మోపుతూనే
మాటల అయస్కాంతంతో మనసుకు గాలం

✧ ✧ ✧

గాలిలో బోల్తా కొడుతున్న దుమ్ము కణాలు
చెప్పి చెప్పకనే హెచ్చరిక
ఏమర్థమయ్యిందో
ఊరకుక్కల చక్కర్లు
కోపంతో ఒకటే మొరుగుడు

✧ ✧ ✧

గుమిగూడిన జనం మాత్రం
మంత్రముగ్ధులై నిశ్చేష్టులై-
మాటల్లోకి దించి గంగిరెద్దుల చేసి
మాట తీసుకోవటం





మాటు వేసిన మాటకారికి యివాళ కొత్త కాదు
భూకంపాలను పసిగట్టే పక్షి నిఘా
అలవడనంతవరకు
'ఊబి' మోసం అనివార్యం

9 ఫిబ్రవరి 2006



# యాతన

ఎగిలి వారకముందే
పాలకేంద్రం మైకుగోలతో
కప్పుకున్న చెద్దర్ని ముందుకు తన్ని
దిగ్గున ఉలిక్కిపడి కళ్ళు నలుపుతూ
నిద్ర లేవటం వారికి పరిపాటే

కాలకృత్యాలు స్నానాలు బాలు దూసుకోవటాలు
పౌడరు స్నోలు తిలకం దిద్దుకోవటాలు
ఇష్టమున్నా లేకున్నా యూనిఫామ్‌లో ఒదగటాలు
షూలు టైలు బండెడు పుస్తకాల సంచుల్ని వీపున కట్టుకొని
ముసిముసి మబ్బులనే రోడ్డు మీద ఉదయించటాలు
ముసిముసి నవ్వుల పల్లెముల్లెల నిత్యకృత్యాలు

అల్లంత దూరంలో
ఎర్రబస్సు కనబడటంతో
ఎగిరి గంతేసిన ఉత్సాహం
కండక్టరు ముఖ కవళికల్తో 'క్యూ'గా మారుతుంది
వెళ్ళండి వెనకాలకు అనే హుకుంతో





బస్సు సీట్ల మధ్య సన్నటి కాలువలాటి
ఖాళీలోంచి గలగల ప్రవహిస్తారు.

ఓ చేత టిఫిన్‌బాక్సు
మరోచేత కంపాస్ బాక్సు
వీపు మీద హమాలీ మోత
చదువంటేనే రోత పుట్టించేంత
ఆందోళన భయం దుఃఖం అసహ్యం
ఆలస్యమైనదనో
బాగా ఉరికించాలనే గొప్ప కోసమో
డ్రైవరన్న పట్టుదలతో బస్సు ఉరుకుడే ఉరుకుడు
బర్రెనో బండో బస్సు కడ్డం రావటంతో సడెన్ బ్రేకు
ఎంత నిగ్రదొక్కుకున్నా
ముందుకు దొర్లిపడే పిల్లల అశక్తత
సల్ల కదలకుండా సీట్ల నిండా కూర్చొని
మీదపడే పిల్లల్ని చీదరించుకునే పెద్దపెద్ద మనస్తత్వాలు
స్టేజి రాగానే బస్సు దిగాలి
వడివడిగా స్కూలు చేరాలి
బెత్తం మాష్టారు కనుసన్నల్లో లైన్ ఫామ్ చేయాలి
తరగతి గదిలో అలుపెరుగని
బోధనతో అపసోపాలు పడాలి
తప్పిపోయి ఎవరికైనా కన్నంటుకుందో
దయలేని బెత్తం తలంటుతుంది
లాంగ్‌బెల్ అయిందన్న ఆనందం
ఆవిరైపోతుంది
స్టడీ అవర్ పేరుతో బడి బుద్ధావతారమౌతుంది
సందెవేళ మళ్ళీ బస్సు పయనం



ఇల్లు చేరేసరికి దీపాలు వెలుగుతాయి
బూట్లు విప్పి కట్లు విప్పి కాళ్ళూచేతులు కడిగామా
నాలుగు ముద్దలు నోట్లో వేసుకోగానే
హోంవర్కు బండశాకిరి
పిల్లల మెదళ్ళతో ఆడుకుంటున్న
అయోమయచిత్తాల ఆశలకు
అలుపూ హద్దూ లేకపోవటం విడ్డూరమే!

*12 ఏప్రిల్ 2006*

*నేటినిజం స్వాతంత్ర్య దినోత్సవ సంచిక, ఆగస్టు 2007*
*మానవీయం కవితా సంకలనం, 2007*
*శ్రీలేఖ సాహితి, వరంగల్లు*





# దాహం

భూమి భుక్తి విముక్తి
పదాలు పాతగానే కనిపించవచ్చు
నాటి నుండి నేటికి
యుద్ధం మాత్రం వీటికోసమే
మనిషి ఆరాటమంతా
భూకేంద్రం చుట్టూ చక్కర్లు కొడుతుంది

తాత ముత్తాతల వారసత్వం
స్వతంత్రంగా బతికి బట్టకట్టిన చరిత్ర వెనుక
బువ్వ పండించిన భూమే ప్రధాన భూమిక
భూమి తరగని నిధి
తరలిపోకూడని బతుకు ఆశ

ఇవాళ భూమి వొక రియల్ ఎస్టేట్
సామ్రాజ్యవాద ప్రపంచీకరణ గ్లోబల్ ఉచ్చులో
ఉక్కిరిబిక్కిరి అవుతున్న రైతు శ్వాస
కనీస నివాసానికి నోచుకోని సామాన్యుడికి అందని ద్రాక్ష

శిఖం మాయం
గుట్ట మాయం



కుంట మాయం
తేడా వొస్తే మనిషి మాయం

అసైన్డ్ భూములు ఆక్రమించే లాబీయింగ్
లాభాల బాటలో రాజకీయం
తరాలు తిన్నా ఒడవని సంపదకు వారసుడు బ్రోకర్
రంగు ఏదైతేనేం లక్ష్యం ఒక్కటే
దాహం దాహం భూమి దాహం

నగరాల చుట్టూ
రహదారుల పరిసరాల కనుమేర చూపులో
ముళ్ళకంచెల రాతిస్తంభాల తోటలు
తనదికాని తన భూమి వద్ద తనే కాపలా
ఇది తాత్కాలిక ఉపశమనమా
నిరంతర దుఃఖానికి మార్గాన్వేషణమా

*24 డిసెంబర్ 2006* *నేటినిజం, గణతంత్ర దినోత్సవ ప్రత్యేక అనుబంధం జనవరి 2007*





# మిణుగురులు-2 (హైకూలు)

సూర్యతాపం
భూమిని
కాల్చుక తింటుంది

✧ ✧ ✧

ఎండ పువ్వు
కాదు కాదు
గోగుపువ్వు

✧ ✧ ✧

చెట్ల వలువలు
గ్రీష్మకృష్ణుడు
దోచుకెళ్ళాడు

✧ ✧ ✧

గల్మదుంకదు
పొలం పారదు
నైరాశ్యంలో చేను పెద్ద

✧ ✧ ✧



ఎండిన చెరువులు
నోళ్ళు తెరిసిన బీళ్ళు
పక్షుల వలస

✧ ✧ ✧

మే ఎండలు
మధ్యాహ్నం వీధులు
సగం కర్ఫ్యూ

✧ ✧ ✧

ఎండను భయపెడ్తూ పొలం పనిలో చెమట చెలమలు
ఎండ పోలీస్ సగం పూటకే బడిపిల్లలు పరార్
మిట్టమధ్యాహ్నం బట్టతలలో సూర్యోదయం
ఎండంటే భయం పాపం ప్యానుగాలికి జ్వరమొచ్చింది

*2 మే 2002*

*నేటినిజం దినపత్రిక*
*17 మే 2002*





# మిణుగురులు-3 (హైకూలు)

**మం**చు సముద్రం
వీధిలైట్ల పడవలు
మునుగుతూ తేలుతూ

✧ ✧ ✧

చలి ఎండ పొడ
ముత్యాల దండల్తో
గడ్డి మొక్కలు

✧ ✧ ✧

వెన్నెల రాత్రి
మంచు వాన
ఘనీభవించా చలిగా

✧ ✧ ✧

ఊరు బయట
మంచు తుపాను
గుడిసె బతుకుల వలవల

✧ ✧ ✧



చలితో ఛాలెంజ్
చేస్తూ
చెరువులో బుడుబుంగలు

✧ ✧ ✧

చలిని దబాయిస్తూ
రొండి మీద నెక్కర్ చినిగిన
డబల్‌రొట్టెల కుర్రాడు

*24 డిసెంబర్ 2000*

*అధ్యాపకజ్వాల, ఫిబ్రవరి 2001*





# ఒక పదవీవిరమణ సందర్భం

**మా**టల్లో ఘాటు రంగరించి
చిలకరించినా
కడుపు మీద కొట్టని ఆత్మీయతకు
ప్రతిబింబం మీరు
ఆగ్రహంతో వురిమినా మెరిసినా
ప్రేమకు నిర్వచనం మీరు
క్రమశిక్షణ సూటితనం గాంభీర్యం
కోపం పశ్చాత్తాపం కరుణ జాలి
బాధను పోగొట్టే మంచి మాటల ఉపశమనం
వయోభారాన్ని మించిన ఉత్సాహం ఉద్వేగం
జఢత్వాన్ని చైతన్యంగా వెలిగించగల నిష్పతనం మీ సొంతం

సార్, నిజంగా మీరంటే మీరే
ప్రత్యేకతకు మారుపేరు
నూతన ఒరవడికి ఆనవాలు
పిల్లలు చదువులోనే కాదు
సామాజిక జీవనంలో రాటుతేలాలనే మీ ఆకాంక్ష
విజ్ఞాన కళాకాంతులతో వెలగాలనే ఆశంస



అప్‌టు డేట్‌గా ఉండాలనే
మీ ఆధునిక ఆలోచన
విద్యార్థుల భవితవ్యానికి దిశానిర్దేశనం అవుతుంది

సార్,
ఇంతవరకు మీరు విద్యార్థులకే ఉపాధ్యాయులు
ఇక మీదట
ఈ సమాజానికి అధ్యాపనం చేసే
మహోపాధ్యాయులు కావాలి

*24 నవంబర్ 2007*

